


మీరు ఎదురు చూస్తున్నారు గదూ? ఇదిగో ఈ కొత్త రహస్యం కనిపెట్టడానికి బాల గూఢచారులు వచ్చేశారు.

ఈసారి బాల గూఢచారులు సెలవలు సరదాగా గడపాలని దేవతల దీవికి వెళ్ళారు. ఒక రాత్రి ఏమయిందో తెలుసా? బీచ్ దగ్గర ఒకటే గందరగోళం. ఏమిటో తెలుసుకోవాలనుకుని వెళ్తే ఎన్నో దేవతా విగ్రహాలు వున్న గదికి వారు చేరుకున్నారు. ఎవరు తెచ్చారబ్బా? అక్కడే ఎవరు వున్నారు ఒక విగ్రహాల నక్కి దొంగ....



చిన్న బోయింది. న్యగులర్లే కనిపించ లేదు. పూజ BSA సైకిల్ ఒక్కసారి ఏదో గట్టి వస్తువు మీద నుంచి వెళ్ళింది.

"చూడండి. ఇది లాల్ అంకుల్ చేతికర్ర" చూపించాడు రాల్ఫ్.

# దేవతల దీవి



రాత్రి 10.30. పూజకి నిద్రపట్టలేదు. అంతకు ముందు రెండు రాత్రులు సముద్రం మీద ఫ్లాష్ లైట్లు పూజ చూసింది న్యగులర్లా? మిగిలిన వారు ఆమె చెప్పింది నమ్మలేదు. రాత్రి 11.05... అదిగో వచ్చేసింది! "విపుల్, రాల్ఫ్ లేవండి" అంటూ ఇద్దరినీ పూజ లేపింది.



## ఎవరబ్బా దొంగ

అందరూ BSA SLR ల మీద బీచ్ వైపు సాగారు. BSA సైకిళ్ల చక్రాలు గట్టిపట్టు యివ్వకపోతే అందరూ ఇసకలో పల్టీలు కొట్టే వారే. అలా బీచ్ దగ్గరకి వెళ్ళిన వారికి బెస్తవారి పాటలు వినిపించాయి. "పడిందిరా పెద్ద చేప" అని పాడుకుంటూ వుంటే పూజ మొహం



"అయితే ఇది ఇక్కడకి ఎలా వచ్చింది" అందరికీ సందేహం వచ్చింది. ఏమిటో తెలుసుకుందాం, అసలు లాల్ అంకుల్ ఇంట్లో వున్నాడా లేడా అని అందరూ BSA SLR సైకిళ్ళ మీద చకచకా సాగారు. అంకుల్ ఇంట్లో లేనే లేడు.

# రహస్యం

ఏమయాడు అనుకుంటూ వుంటే గేటు తెరచుకుని లాల్ అంకుల్ లోపలికి వచ్చాడు. చేతిలో ఏమీలేదు. కాళ్ళకి జోళ్లులేవు. "ఇదేమిటి" పూజ అర్థంకాక ఆశ్చర్యపోతూ అంది. చేతికర్ర లేని లాల్ అంకుల్‌ని వాళ్ళెప్పుడూ చూడలేదు.

## విగ్రహాలు, దేవతా విగ్రహాలు

లాల్ అంకుల్ గది తలుపులు మూసిన వెంటనే, బాల గూఢచారులు అతను వచ్చిన వైపు వెళ్ళారు. రాల్ఫ్ తన బైనాక్యులర్స్‌లో చూశాడు. తేలికగా వుంది కనుక BSA SLR మీద సులభంగా నిలిచాడు. "అదిగో అక్కడ కనిపిస్తోంది ఒక పాక" అన్నాడు. పూజ బైనాక్యులర్స్ తీసుకుని చూసింది. "అమ్మో పేపర్లలో పోయాయని రాసిన రకరకాల దేవతా విగ్రహాలు ఇక్కడే వున్నాయి" అంది ఆనందంతో.

ఇంతలో టార్చిలైట్ మినుకు మినుకు కాంతిని వారు చూశారు. ఆ కాంతి పాక మీదకి వెళ్తోంది.



"రండి. BSA SLR ల మీద వేగంగా బయలుదేరండి. ఆ గుట్టల వెనకాల దాక్కోండి" అరిచాడు రాల్ఫ్. దేవతా విగ్రహాల దొంగ ఎవరు? తెలుసుకోవాలంటే పక్షుల వేటగాళ్ళ రహస్యం చదవండి.

Ekco®

# మార్కర్

"24" వున్న ఒక ప్యాక్‌లో

ఇది సరికొత్తది ! సుందరమైనది ! ప్రకాశవంతమైన, చలింపజేసే రంగులు !

అనేక మిలియన్ల మార్కర్ సెట్లు యు.ఎస్.ఎ కు ఎగుమతి చేయబడ్డాయి.

'12' వున్న ప్యాక్‌లలో
కూడ లభ్యం

Ekco
MARKERS
24 FINE LINE WATER COLOUR MARKERS
colour, draw and write in a rainbow of colours

I ♥ Ekco MARKERS

పిల్లలకు ప్రియమైన కానుక




భారతదేశంలో తయారు చేసే వారు మరియు ఎగుమతి చేసే వారిలో అగ్రగణ్యులు.

ప్రెసిషన్ రైటింగ్ పాయింట్స్ ప్రై. లిమిటెడ్, 18, సుభాష్ రోడ్, విలేపార్లె (తూ.) బొంబాయి-400 057.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## సత్యాన్వేషణ

ఏటా అక్టోబర్ నెలలో సభలూ, సమావేశాలూ ఏర్పాటుచేసి గాంధీజయంతి ఉత్సవాలు దేశమంతటా జరుపుకుంటున్నాము. మహాత్మాగాంధీ పేరు వినగానే మనకు 'సత్యాగ్రహం' అన్న మాట స్ఫురిస్తుంది.

ఇరవైయ్యవ శతాబ్దారంభంలో, మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, బారిష్టర్‌గా—దక్షిణాఫ్రికా ప్రభుత్వం ఆ దేశంలో భారత జాతీయులకు వ్యతిరేకంగా పాటించిన వివక్షతను వ్యతిరేకించి శాంతియుత పోరాటం సాగించారు.

ఆయన భారత దేశానికి తిరిగివచ్చాక, స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహించారు. సత్యమే లక్ష్యంగా అహింసా మార్గంలో సాగిన సహాయ నిరాకరణోద్యమానికి గాంధీజీ 'సత్యాగ్రహం' అని పేరుపెట్టారు. సత్యాగ్రహం అంటే సత్యాన్వేషణ, సత్యశోధన, సత్యం కోసం సాగించే సాత్వికపోరాటం!

ఈ సత్యాన్వేషణలో హింసకు ఏమాత్రం స్థానంలేదు. గాంధీజీ దీనినే ఆత్మశక్తి అని కూడా అన్నారు. ఆత్మశక్తితో అంటే మనోబలంతో సాధించలేనిది ఏదీ లేదని బాపూజీ తన జీవితంలో నిరూపించారు.

స్వాతంత్ర్యానంతరం, మనదేశంలో కొందరు సత్యాగ్రహం పేరు చెబుతూ, తమ లక్ష్యాలను సాధించడానికి హింసాత్మక పద్ధతులను అనుసరిస్తున్నారు. ఇది బాపూజీ సిద్ధాంతాలకు, బోధనలకు పూర్తిగా విరుద్ధమైనది. ఏ సమస్యకైనాసరే ఒక పరిష్కారం ఉంటుంది. దానిని అహింసా మార్గంలో సాధించినప్పుడే మనం మహాత్మాగాంధీ సిద్ధాంతాలకు న్యాయం సమకూర్చినవారమవుతాము.

సంపుటి 89 అక్టోబర్ '91 సంచిక 4

విడి ప్రతి : 4-00 : : సంవత్సర చందా : 48-00





# ప్రపంచ శాంతికోసం





అత్యధికమైన అణ్వాయుధాల నిలువలు గల అగ్రరాజ్యాలయిన అమెరికా, సోవియట్ రష్యాలు—ఆయుధాలు తగ్గించడానికి ఒక ఒడంబడిక కుదుర్చుకున్నాయి. జూలై 31వ తేదీన ఉభయదేశాల నేతలు మాస్కోలో సమావేశమై ఆయుధాల తగ్గింపు ఒడంబడిక (ఎస్ టి ఏ ఆర్ టి)లో సంతకాలు చేశారు. చరిత్రాత్మకమైన ఈ సంఘటన, మరొక ప్రపంచ యుద్ధం రాకుండా చేయడానికి దోహదం చేయగలదని పరిశీలకులు భావిస్తున్నారు!

అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్, సోవియట్ అధ్యక్షుడు గోర్బచేవ్ ఒకరినొకరు కలుసుకోవడం ఇదే ప్రథమం కాదు. అయినా, వారిరువురు జూలై నెలాఖరులో మాస్కోలో సమావేశం కావడంతో—దాదాపు యాభైసంవత్సరాలుగా, పరస్పర అనుమానంతో, ఒకరినొకరు దెబ్బతీయడానికి ఉభయదేశాలమధ్య సాగిన ఆయుధ సేకరణ పోటీ అంతమయింది.

అగ్రరాజ్యాలమధ్య రోజురోజుకూ పెరిగిపోతూన్న ఆయుధపోటీ కారణంగా, మరొక ప్రపంచ యుద్ధం సంభవించే అపాయం వుందనీ, అందువల్ల ఆయుధ సేకరణకు ఉభయదేశాలూ స్వస్తి చెప్పాలనీ, అనేక ప్రపంచదేశాలూ, ఐక్యరాజ్యసమితీ తరచూ కోరుతూ వచ్చాయి. దాని ఫలితంగా యాభైశాతం ఆయుధాలు తగ్గించుకోవా

లన్న ఆశయంతో ఉభయదేశాల మధ్య 1982 వ సం॥లో చర్చలు ప్రారంభ మయ్యాయి.

తొమ్మిదేళ్ళ పరస్పర చర్చల అనంతరం 'ఎస్ టి ఎ ఆర్ టి' ఒడంబడిక ద్వారా 30 శాతం అణ్వాయుధాలు తగ్గించడానికి ఉభయదేశాలు అంగీకరించాయి. దాని ప్రకారం సోవియట్ యూనియన్ 35 శాతం, అంటే 9000 వేల అణ్వాయుధాలనూ, అమెరికా 25 శాతం, అంటే 7000 అణ్వాయుధాలనూ తగ్గిస్తాయి!

కేవలం 4000 అణ్వాయుధాలు ఏ దేశం దగ్గర వున్నా, అది మరొక దేశానికి తీరని నష్టం కలిగించే శక్తి కలిగి వుంటుందని యుద్ధ నిపుణులు అభిప్రాయపడుతున్నారు. ఈ ఒడంబడిక ద్వారా ఒక్కొక్క దేశంలోనూ 1600 అయుధ వాహకాలు తగ్గుతాయి. అంటే, ఒక్కొక్క దేశం దగ్గరా కావలసినన్ని రాళ్ళున్నాయి గాని, వాటిని విసరడానికి అవసరమైన వడిసెలలు లేవు!

ఈ 'ఎస్ టి ఏ ఆర్ టి' ఒడంబడిక పదిహేనేళ్ళ వరకు అమలులో వుంటుంది. ఆ తరవాత ఐదేళ్ళకొకసారి ఒడంబడికను పునరుద్ధరించుకోవచ్చు. ఈ ఒప్పందం ప్రకారం ఉభయదేశాలలోని ఆయుధాలను పరిశీలించడానికి ఉమ్మడి కమిటీ నొకదాన్ని ఏర్పాటుచేస్తారు.

ఈ ఒడంబడిక ద్వారా ప్రపంచం, విశ్వశాంతికేసి రెండడుగులు ముందుకు వేసిందని విశ్వసించవచ్చు!





# అల్లరిభూతం

లలితాపురం అనే గ్రామం చెరువుకట్ట మీద, వందేళ్ళనాటి పెద్ద ఊడలమర్రి ఒకటున్నది. ఒక రోజున చిలిపిక అనే భూతం ఎక్కడినుంచో వచ్చి, ఆ మర్రి చెట్టు మీద చేరింది. అది వట్టి అల్లరి భూతం. ఇతర్లను ఆటపట్టించడమంటే, దానికి మహదానందం.

ఒకనాటి సాయంకాలం వేళ ఏడుకొండలు, రామనాథం అనే గ్రామస్థులిద్దరు, మర్రిచెట్టు కిందికి వచ్చి కూర్చున్నారు. ఏడుకొండలుకు పెద్ద పిలక వున్నది. చిలిపిక వాడి దగ్గిరకు పోయి, పిలక పట్టుకుని లాగింది.

ఏడుకొండలు అబ్బా అంటూ మూలిగి, రామనాథం కేసి కొరకొరా చూస్తూ, ''ఏరా! నా పిలకపట్టుకుని లాగుతావా?'' అని రామనాథం చెంప మీద గట్టిగా కొట్టాడు.

దానితో రామనాథం రెచ్చిపోయి, ''ఛీ, నీ చచ్చుపిలక నేను లాగడం ఏమిటి? అయితే ఉండు, అంత పనీ చేస్తాను!'' అంటూ ఏడుకొండలు పిలక పట్టుకుని బలంగా గుంజాడు.

తర్వాత ఇద్దరూ కలబడి తిట్టుకుంటూ కొంతసేపు తన్నుకుని, గ్రామ మునసబు దగ్గిరకు బయలుదేరారు. చిలిపిక పట్టలేని ఆనందంతో గాలిలో అదృశ్యంగా తేలుతూ వాళ్ళను అనుసరించింది. వాళ్ళు వెళ్ళేసరికి మునసబు చెంచయ్య రచ్చబండ మీద కూర్చుని చుట్టకాలుస్తూ, అక్కడ చేరినవాళ్ళతో మాట్లాడుతున్నాడు.

ఏడుకొండలు మునసబుకు జరిగిన సంగతి చెప్పి, ''అయ్యా, నాకు చేసిన అవమానానికిగాను, తమరు ఈ రామనాథంగాణ్ణి గట్టిగా శిక్షించాలి!'' అని కోరాడు.

ఎస్. శివనాగేశ్వరరావు



అప్పుడు రామనాథం, మునసబుతో, "అయ్యా, వీడు చెప్పేవన్ని పచ్చి అబద్ధాలు. చేయనినేరం, నా మీద మోపి చెంపమీద కొట్టాడు. నేను కోపం పట్టలేక వీడి పిలక లాగాను," అన్నాడు.

వాళ్ళు చెప్పేది వింటూ మునసబు కాలుతున్న చుట్టను పక్కన పెట్టాడు. ఇది చూసిన చిలిపికకు, మునసబును కూడా ఆటపట్టించాలన్న బుద్ధిపుట్టింది. అది కాలుతున్న చుట్టను తీసి, మునసబు చొక్కాజేబులో వేసింది.

ఏదో తీర్పు చెప్పబోయిన మునసబు, తన జేబులోంచి పొగరావడం చూసి కంగారుపడి, జేబులో చెయ్యి పెట్టేసరికి, కాలుతున్నచుట్ట, అతడి చేతిని చురుక్కుమనిపించింది. దానితో మునసబు లేచి నిలబడి చెయ్యి విదిలిస్తూ, ఏడుకొండలు, రామనాథాల మీద మండిపడి, "అసలీ సంవత్సరం మీరు భూమిశిస్తు కట్టాలనుకుంటున్నారా, ఎగవేయాలనుకుంటున్నారా? రేపీపాటికి కట్టకపోతే, మీ భూములు జప్తుచేస్తాను. ఇక ఇక్కణ్ణించి పొండి!" అన్నాడు.

తర్వాత మునసబు చొక్కా మార్చుకోవడానికి, ఇంటికి బయలుదేరాడు. అల్లరి భూతంకూడా అతడివెనక బయలుదేరింది.

మునసబు భార్య కాంతమ్మ పరమ గయ్యాళి. ఆవిడ భర్త చొక్కాజేబు కాలి వుండడం చూసి, "ఆ దిక్కుమాలిన చుట్టలూ, నువ్వూ! బంగారు లాంటి చొక్కా తగలబెట్టుకువచ్చావా?" అంటూ అరవసాగింది.

చిలిపికకు ఆ భార్యాభర్తల మధ్య గొడవ మరింతగా పెంచి వినోదించాలనిపించింది. అది మునసబు చేతిలోని కర్రను ఎత్తి, కాంతమ్మ వీపు మీద బలంగా కొట్టింది. తన ప్రయత్నం ఏమీ లేకుండా, ఇలా జరిగినందుకు మునసబు విస్తుపోయాడు.

దెబ్బ తింటూనే కాంతమ్మ శివమెత్తిన దానిలా కేకలు పెడుతూ, "నా మీద

చేయి చేసుకుంటావా ? చూడు, నీ అంతు తేలుస్తాను ! మొన్నటికి మొన్న కట్టకింది గురవయ్య దగ్గిర, ఐదువందల వరహాలు లంచం తీసుకుని, అతడికి అనుకూలంగా తీర్పు చెప్పిన సంగతి, పదిమందికీ చెప్తాను,'' అంటూ వీధిలోకి పోయి, జనాన్ని పోగుచేసి, భర్త లంచగొండితనం గురించి అందరికీ చెప్పేసింది.



దానితో గ్రామంలో పలుకుబడి వున్న నలుగురూ చేరి, చర్చలు జరిపి, లంచ గొండి మునసబును పదివి నుంచి తొలగించాలని పై అధికారులకు వినతిపత్రం పంపారు. వాళ్ళు మూడో నాటికల్లా చెంచయ్యను పదవి నుంచి తొలగించి, మరొకరిని గ్రామమునసబుగా నియమించారు.

ఇది జరిగిన వారం తర్వాత, చిలిపిక మర్రిచెట్టు కొమ్మల్లో కునుకు తీస్తుండగా, చెట్టుకింద ఇద్దరు మనుషులు చేరి గుసగుసలాడుకుంటున్నారు. చిలిపిక చెట్టు దిగి వాళ్ళపక్కన చేరింది. వాళ్ళ మాటలను బట్టి, వాళ్ళిద్దరూ దొంగలనీ, ఒకడి పేరు కన్నడూ, మరొకడి పేరు భీముడూ అని చిలిపిక గ్రహించింది.

దొంగలిద్దరూ కొద్దిసేపు తర్వాత, అక్కణ్ణించి బయలుదేరారు. చిలిపిక వాళ్ళను అనుసరించింది. వాళ్ళు వడ్డీ వ్యాపారి చండీదాసు ఇంటికి పోయి, ప్రహరీగోడ దూకి, ఇంటికి కన్నం వేశారు. భీముడు లోపలికి పోయే ప్రయత్నంలో వుండగా, కన్నడు కాపలాకోసం దూరంగా వెళ్ళాడు.

చిలిపిక ఇదే అదను అనుకుని, కన్నంలో దూరిన భీముడి కాలొకటి పట్టుకున్నది. ఎవరైనా అటుగా వస్తున్నారేమో, అందుకే హెచ్చరికగా కన్నడు తన కాలు పట్టుకున్నాడనుకుని, భీముడు బయటికి రాబోయాడు. అయితే, చిలిపిక వాడు బయటకు రాకుండా, లోపలికి పోకుండా కాలు బిగించింది. భీముడు కాలువదలమని విదిలించసాగాడు. వాడికి కన్నడి మీద చాలా కోపం వచ్చింది.



దానికీ, కానిదానికీ ఇలా దొరికిపోతూంటే, నా నెలసరి మామూళ్ళు ఎలా ఇవ్వగలరు? ఎక్కడ దొంగతనం చేస్తారో, నాకు తెలీదు. రేపు రాత్రికి వెయ్యి వరహాలు తెచ్చివ్వాలి. అలా జరక్కపోతే, మీరెక్కడున్నా వెదికి పట్టుకుని, తన్ని చెరసాలలో పారేస్తాను, జాగ్రత్త!'' అని హెచ్చరించి వదిలేశాడు.

ఇది చూసిన చిలిపికకు, కొత్వాలు ఎంత లంచగొండో అర్థమైంది. అది కొత్వాలుకు తగినవిధంగా బుద్ధి చెప్పాలని నిశ్చయించుకున్నది.

అంతలో కన్నడు అక్కడికి వచ్చాడు. చిలిపిక భీముడి కాలు వదిలేసింది. కన్నడు, కన్నంలో గింజుకుంటున్న భీముణ్ణి చూసి, వాడు కన్నంలో ఇరుక్కుపోయి వుంటాడనుకుని, సాయంపడదామని వాడి కాలు పట్టుకున్నాడు. భీముడు కోపం కొద్దీ వాణ్ణి బలంగా ఒక్క తన్ను తన్నాడు.

ఆ దెబ్బకు కన్నడు ఒక చావుకేక పెట్టాడు. దానితో చండీదాసు ఇంటిలోని వాళ్ళేకాక, పక్క ఇళ్ళల్లోని వాళ్ళుకూడా మేలుకుని, దొంగలిద్దర్నీ దాపులనున్న పట్నంలోని కొత్వాలుకు అప్పగించారు.

కొత్వాలు, ఆ ఇద్దర్నీ చెరసాలకు తీసుకుపోయి, ''వెధవల్లారా! అయిన

మర్నాటి రాత్రి కన్నడూ, భీముడూ అర్ధరాత్రివరకూ ఎక్కడైనా దొంగతనం చేసేందుకు ప్రయత్నించి, సాధ్యపడక వచ్చి, మర్రిచెట్టు కింద దిగులుపడుతూ కూర్చున్నారు. ఇది గమనించిన చిలిపిక జమీందారింటికి పోయి, కొన్ని నగలు మూటకట్టుకుని వచ్చి, చెట్టుపై నుంచి దాన్ని వాళ్ళ మీదికి జార్చింది.

ఆ మూటలోని నగలు చూసి దొంగలిద్దరూ, ఏ దేవతో తమను కరుణించి వాటిని ప్రసాదించిందనుకుంటూ పోయి, కొత్వాలుకు కొన్ని నగలను మామూలు కింద ఇచ్చారు.

కొత్వాలు భార్యకు నగలపిచ్చి జాస్తి. ఆమె ఆ నగల్ని అలంకరించుకుని,

సాయంత్రంవేళ జమీందారింటికి పేరం టానికి వెళ్ళింది. జమీందారు భార్య, తన నగలు కొత్వాలు భార్య ఒంటి మీద వుండడం చూసి ఆశ్చర్యపోయి, తన నగల పెట్టె తెరిచి చూసుకున్నది. అందులో నగలంటూ ఏమీ లేవు.

జమీందారు భార్య ద్వారా సంగతి తెలుసుకుని, కొత్వాలు భార్యను గట్టిగా ప్రశ్నించిన మీదట, ఆమె ఆ నగలు రాత్రి తన భర్త తెచ్చినట్టు చెప్పింది. జమీం దారు కొత్వాలును పిలిపించాడు. ఇంతలో కన్నడూ, భీముడూ తమవంతు నగలను అమ్మబోయి దొరికిపోయారు.

ఈ విధంగా దొంగలతోపాటు కొత్వాలు కూడా చెరసాల పాలయ్యాడు. ఇది చూసి చిలిపికకు కలిగిన ఆనందం అంతా ఇంతా కాదు.

ఒకనాడు నలుగురు గ్రామస్థులు, మర్రి చెట్టు కింద కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడు కుంటున్నారు. మాటల సందర్భంలో వాళ్ళల్లో ఒకడు, గ్రామంలోని పండి తుడూ, మంత్రవేత్తా అయిన జ్ఞానదీప్తుడి ప్రసక్తి తెచ్చాడు. ఆయనకు తన నాలుగేళ్ల మనమడంటే ప్రాణంతో సమానం. ఒక్క క్షణం కూడా వాణ్ణి విడిచి వుండలేడు.

చెట్టు పైన వుండి ఇది విన్న చిలిపికకు, ఆ పండితుణ్ణి ఒక ఆటపట్టించాలన్న కోర్కె కలిగింది. అది తక్షణం బయలు దేరి, ఇంటి పెరట్లో ఆడుకుంటున్న పండి తుడి మనవణ్ణి తీసుకుని, ఒక పండ్లతోట



చేరింది. అక్కడ అది, పిల్లవాడి ముందు కొన్ని జామపండ్లూ, మామిడిపండ్లూ వుంచి, ఏమి జరుగుతుందో చూద్దామని, దాపులనున్న ఒక మామిడిచెట్టు పైకి పోయి కూర్చున్నది.

కొంతసేపటికి జ్ఞానదీప్తుడు మనమణ్ణి వెతుకుతూ నలుగురు గ్రామస్థులతో అక్కడికి వచ్చి, పండ్లుతింటూ కూర్చుని వున్న మనమణ్ణి చూసి ఆశ్చర్యపోయాడు. పిల్లవాడు ఇక్కడికి చేరడం వెనక ఏదో నిగూఢరహస్యం వున్నదన్న అనుమానం ఆయనకు కలిగింది.

వెంటనే జ్ఞానదీప్తుడు పక్కన వున్న వాళ్ళను దూరంగా వెళ్ళమని చెప్పి, కర్రతో నేల మీద ఒక వలయం గీసి, మంత్రం పఠించి చిలిపికను రప్పించాడు. చిలిపిక వణికిపోతూ, పండితుడి పాదాలకు నమస్కరించి నిలబడింది.

జ్ఞానదీప్తుడు, ఆ అల్లరి భూతాన్ని ప్రశ్నించి, అది మర్రిచెట్టు మీద చేరి ఏడుకొండలు పిలక లాగడం నుంచి చేసిన అన్ని పనులూ బయటపెట్టించాడు. తర్వాత ఆయన చిలిపికతో, ''ఇంతవరకూ నువ్వు చేసిన అల్లరి పనులవల్ల గ్రామానికి చాలా మేలు జరిగింది. లంచగొండులైన మునసబూ, కొత్వాలూ తగిన విధంగా శిక్షించబడ్డారు. కాని ఇప్పుడు నువ్వు, నా మనమణ్ణి అపహరించి ఇక్కడికి తీసుకురావడం మాత్రం, చాలా చెడ్డపని. అందుకుగాను నీకు స్వల్పమైన శిక్ష విధించబోతున్నాను,'' అన్నాడు.

''స్వల్పమైన శిక్షా? అదేమిటో సెలవివ్వండి, స్వామీ!'' అన్నది అల్లరిభూతం భయపడుతూ.

''నువ్వీ మరుక్షణాన, ఈ ప్రాంతాల నుంచి వెళ్ళిపోవాలి. ఈ గ్రామానికి చుట్టూ పది ఆమడల దూరంలో ఎక్కడా కనిపించకూడదు!" అన్నాడు జ్ఞానదీప్తుడు.

ఆ వెంటనే చిలిపిక, ''మహాప్రసాదం, స్వామీ!'' అంటూ గాలిలోకి లేచి, అక్కడికి ఇరవై ఆమడలదూరంలో వున్న కొండలకేసి ఎగిరిపోయింది.






## 8

[అపూర్వుడి ఆదేశానుసారం, సమీరుడు, సముద్రపు దొంగలపాలైన ఐదుగురు కుర్రవాళ్ళను కాపాడడానికి ఆయనతోపాటు గండుమీనం మీదెక్కి ఓడను చేరుకున్నాడు. వర్తకుల ఓడను దోచుకోవడానికి గరళనాభుడి నాయకత్వంలో సముద్రపు దొంగలు వేసిన పథకం బెడిసికొట్టింది. వర్తకుల సాయంతో సమీరుడూ, అయిదుగురు కుర్రవాళ్ళూ తీరం చేరారు. —తరవాత]

సురక్షితంగా తిరిగివచ్చిన పిల్లలను చూసి, వాళ్ళ తల్లిదండ్రులూ, బంధుమిత్రులూ అమితానందం చెందారు. దుర్మార్గులైన సముద్రపుదొంగలు పట్టుబడడంతో, ప్రజలందరూ పరమానందం చెందారు. రాజు దొంగలను కారాగారంలో బంధించి, ఐదుగురు కుర్రవాళ్ళ ధైర్యాన్ని ఎంతగానో మెచ్చుకున్నాడు. సమీరుణ్ణి ఘనంగా సత్కరించాడు. సమీరుడి తెలివితేటలనూ, ధైర్యసాహసాలనూ అందరూ వేనోళ్ళ పొగిడారు.

సమీరుడికి వారి పొగడ్తలు ఇబ్బంది కలిగించాయి. ఎందుకంటే, అపూర్వుడి కరుణవల్లే, కుర్రవాళ్ళను సముద్రపు దొంగల నుంచి సమీరుడు రక్షించగలిగాడు. తాను అపూర్వుడి చేతిలో కేవలం చిన్న ఆయుధం మాత్రమే అన్న విషయం అతడికి ఒక్కడికే తెలుసు.



సత్కారాల హడావుడి సద్దుమణిగిన తరవాత, సమీరుడు తమ ఇంటి సమీపంలో వున్న ప్రశాంత స్థలానికి ఒంటరిగా వెళ్ళాడు. ఏకాగ్రచిత్తంతో ఎప్పుడు పిలిచినా వస్తానని అపూర్వుడు మాట ఇచ్చాడు. ఇప్పుడు ఆయనను చూడాలనుకుని, సెలయేటిపక్కన వున్న బండ మీద కూర్చుని, అపూర్వుణ్ణి తలుచుకుని కళ్ళు మూసుకోబోయాడు. ఆ క్షణమే, ''నేను ఇక్కడే ఉన్నాను, సమీరా!'' అన్న మధురకంఠస్వరం వినిపించింది.

మందహాసంతో ఎదుట నిలబడిన అపూర్వుణ్ణి చూడగానే సమీరుడు చేతులు జోడించి నమస్కరించాడు.

''సమీరా, నువ్వు నన్ను చూడాలనుకున్నదానికి ముందే నేనూ, నిన్ను చూడాలనుకున్నాను. అందుకే ఇలా వచ్చాను.'' అన్నాడు అపూర్వుడు.

సమీరుడు చాలా సంతోషంగా, ''ఆహా ఆహా....!'' అన్నాడు తప్ప మరేమీ మాట్లాడలేకపోయాడు.

''మనం అనుభవిస్తూన్న ఈ ఆనందాన్ని ప్రజలందరికీ పంచాలి. ముఖ్యంగా మీ గ్రామంలోని పేద ప్రజల పరిస్థితి మరీ దీనంగా ఉన్నది. తినడానికి తిండిలేక, కట్టుకోవడానికి బట్టలేక, రోగాలకు వైద్యం చేయించుకోలేక కటికదరిద్రంతో వాళ్ళు అలవికాని బాధలు అనుభవిస్తున్నారు. నువ్వు వాళ్ళకేమైనా సాయం చేయలేవా?'' అని అడిగాడు అపూర్వుడు.

"నేనేం సహాయంచేయగలను, స్వామీ! నాకూ వాళ్ల బాధలు పోగొట్టాలనే వున్నది. అయితే, వాళ్ళ బాధలన్నిటికీ మూలం దరిద్రం. ధనం వుంటే తప్ప, నేను వాళ్ళ దరిద్రాన్నీ, బాధలనూ పోగొట్టలేను. మరి నా దగ్గర ధనం లేదుకదా?'' అన్నాడు సమీరుడు.

''నీకు కావలసిన ధనం నేను సమకూరుస్తాను. అదిసరే, నన్ను స్వామీ అని పిలువకూడదని ఎప్పుడో చెప్పాను. మరోసారి అలా పిలిచావో నేను నీతో

మాట్లాడను,'' అన్నాడు అపూర్వుడు మందలిస్తూన్నట్టు.

''మీ ఆజ్ఞను పాటిస్తాను, మిత్రమా! ఇంతకూ నాకు ధనం ఎలా సమకూరుస్తావు?'' అని అడిగాడు సమీరుడు.

''నేను ఓడలో ఉన్నప్పుడు, సముద్రపు దొంగలు, శిలాద్వీపంలో దాచిన నిధిని గురించి మాట్లాడుకోవడం విన్నాను. దాదాపు పదేళ్ళక్రితం, ఒకానొక యువరాణి, పెళ్ళి చేసుకుని, అత్తవారింటికి వెళుతున్నప్పుడు పెద్ద దొంగల ముఠా వాళ్ళపైబడి ఆభరణాలను దోచుకున్నదట!'' అని అపూర్వుడు ఇంకేదో చెప్పబోయేంతలో, సమీరుడు అడ్డుపడి, ''అవునవును. ఆ దోపిడీని గురించి మా పెద్దలు కూడా తరచూ కథలు కథలుగా చెప్పుకునేవాళ్ళు!'' అన్నాడు పట్టరాని ఉత్సాహంతో.

''నిజమే! మణులు మాణిక్యాలు పొదిగిన యువరాణి ఆభరణాలనూ, ఇతరుల నుంచి దోపిడీ చేసిన మరిన్ని అమూల్యమైన నగలనూ, బంగారాన్నీ దొంగలు శిలాద్వీపంలోని గుహలో దాచారు. అంతలో హఠాత్తుగా వాళ్ళమధ్య తగాదా ఏర్పడి, దొంగలు రెండు ముఠాలుగా చీలిపోయి, ఒకరిపై ఒకరు కత్తులు దూశారు. నిధి తమకు చెందాలంటే తమకే చెందాలని ఇరు వర్గాల మధ్య ఘర్షణలు బయలుదేరడంతో, ఏ ముఠావాళ్ళుగాని నిధిని వశపరుచుకోలేకపోయారు. ఇటీవల జరిగిన ఒక ఘర్షణలో ఒక ముఠాదొంగలు, శత్రువర్గంలో చాలామందిని హతమార్చారు. ఏదో కొందరు మాత్రమే తప్పించుకుని పారిపోయారు. జయించిన ముఠాకు చెందిన దొంగలనే నువ్వు మొన్న రాజుగారికి అప్పగించావు. వాళ్ళు వర్తకుల ఓడను దోచుకున్న తరవాత ఆ నిధిని వశపరచుకోవాలని పథకం వేశారు గాని, ఆ దురాశాపరులందరూ ప్రస్తుతం జైళ్ళపాలయ్యారు!'' అన్నాడు అపూర్వుడు చిన్నగా నవ్వుతూ.





"అంటే సురక్షితంగా వున్న ఆ నిధిని ఇప్పుడు మనం వశపరచుకోవచ్చున్న మాట!" అన్నాడు సమీరుడు.

"అవును. అయినా, అది అక్కడ ఎంతోకాలం సురక్షితంగా వుండే అవకాశం లేదు. ఎందుకంటే ప్రాణాలతో తప్పించుకున్న దొంగలకు తమ శత్రువులు జైళ్ళ పాలయ్యారని తెలియగానే, వాళ్ళు ఆ నిధిని వశపరచుకోవడానికి త్వరపడవచ్చు." అన్నాడు అపూర్వుడు.

"అది సరే, మనం ఆ శిలాద్వీపాన్నికనుగొనడం ఎలా ?" అని అడిగాడు సమీరుడు.

"మొన్న మనల్ని ఓడదగ్గరికి తీసుకువెళ్ళిన గండుమీనాలకు ఆ శిలాద్వీపం ఎక్కడున్నదీ తెలుసనుకుంటాను. నా ఆలోచనలను పసిగట్టి, వాటికి అనుగుణంగా నడుచుకునే స్నేహితులు ఆ గండుమీనాలు. ఈ విషయంలోనూ అవి మనకు తప్పకుండా సాయపడగలవని భావిస్తున్నాను. రేపు నిండు పున్నమి. మనం శిలాద్వీపాన్వేషణకు బయలుదేరడానికి తగిన సమయం," అన్నాడు అపూర్వుడు.

ఆ మాటలు విని సమీరుడు అమితోత్సాహంతో, "మనతోపాటు ఆ ఐదుగురు మిత్రులను కూడా తీసుకువెళదామా? మిమ్మల్ని చూడాలనీ, మీతో కలిసి సాహసయాత్ర చేయాలనీ వాళ్ళు కుతూహలపడుతున్నారు," అని అడిగాడు.

అపూర్వుడు కొంతసేపు ఆలోచించి, సరేనని చెప్పి వెళ్ళిపోయాడు.

సమీరుడు కుర్రవాళ్ళ తల్లిదండ్రుల అనుమతి తీసుకుని, వాళ్ళను వెంటబెట్టుకుని మరునాడు సాయంకాలం సముద్రతీరానికి బయలుదేరాడు. ఐదుగురు మిత్రులూ అపూర్వుణ్ణి చూడడానికి ఉరకలు వేసే ఉత్సాహంతో వచ్చారు. వాళ్ళుసముద్రతీరం చేరేసరికి అపూర్వుడు అక్కడే ఉన్నాడు. కుర్రవాళ్ళు ఆయనకు నమస్కరించారు. అపూర్వుడు చిరునవ్వుతో పలకరించాడు.

తూర్పు దిక్కున నిండు చంద్రుడు వెన్నెలలు వెదజల్లుతూండగా, అపూర్వుడు ఒక్కక్షణం కళ్ళుమూసుకుని గండు మీనాలను స్మరించాడు. మరుక్షణమే అలలకు ఆవల ప్రశాంతంగా ఉన్న సముద్ర జలాలను పైకి చిమ్ముతూ గండు మీనాలు ఎగిరి దూకడం కనిపించాయి. కొంతసేపటికల్లా అవి తీరాన్ని సమీపించి, ప్రయాణానికి సంసిద్ధతను తెలియజేసే విధంగా వింత ధ్వనులు చేశాయి. వాటిలో పెద్దదిగా ఉన్న గండుమీనం వీపు మీదికి అపూర్వుడు చేరాడు. ఆయన ఆజ్ఞ కాగానే, సమీరుడూ, ఐదుగురు మిత్రులూ వేర్వేరు గండుమీనాల మీదికి ఎక్కి కూర్చున్నారు. మరో పన్నెండు గండుమీనాలు వాళ్ళకు రక్షణగా వచ్చాయి. అన్నీ కలిసి కట్టుగా సముద్రం లోకి దూసుకుపోసాగాయి.

అపూర్వుడు ఎక్కిన గండుమీనం మిగతావాటికి దారి చూపుతూ ముందు ఈదసాగింది. ప్రశాంతంగా ఉన్న సముద్రం మీద గాలి మెల్లమెల్లగా వీచ సాగింది. అపూర్వుడి తలకు పైన కొన్ని సముద్రపుకాకులు గిరికీలు కొడుతూ ఎగర సాగాయి. అలా చాలా సేపు ప్రయాణం చేసి, చంద్రుడు నడినెత్తిమీదికి వచ్చిన సమ యానికి, వాళ్ళు సముద్రజలం మధ్య నిటా



రుగా నిలబడిన రాక్షసుల గుంపులాగా కని పించే శిలాద్వీపాన్ని సమీపించారు. గండు మీనాలు ఆ శిలలను అనుకుని ఆగాయి.

అపూర్వుడూ, ఆయన ఆరుగురు మిత్రులూ గండుమీనాలపై నుంచి దిగి శిలాద్వీపంలో అడుగు పెట్టారు. పెద్దపెద్ద బండల వంటి శిలల మధ్య అసంఖ్యాక మైన గుహలు కనిపించాయి. సముద్రపు దొంగలు దాచిన నిధి ఏ గుహలో ఉన్నదో తెలుసుకోవడం ఎలా? అది అంత సులభంగా కనిపించలేదు.

కుర్రవాళ్ళు ముందున్న గుహలోపలికి తొంగిచూశారు. అక్కడ ఏదో తళతళా మెరుస్తూ కనిపించడంతో, సమీరుడు వంగి,



మెల్లగా గుహలోపలికి జొరబడ్డాడు. చుట్టూ చీకటి, నేల చిత్తడిగా ఉన్నది. సమీరుడు మోకాళ్ళ మీదికి వంగి, ముందుకు పాకసాగాడు. కాని, గుహలోపలి బొరియలలోని పాములు బుస్సు మనడంతో వాడు భయపడి వెనక్కు వచ్చేశాడు!

''సరే, ఇప్పుడు ఎలాగో ఈ శిలాద్వీపాన్ని కనుగొన్నాం. మరొకసారి వచ్చి, నిధిని నింపాదిగా వెతికి వెలికి తీయవచ్చు. ఇప్పుడు తిరిగి వెళ్ళిపోదాం,'' అన్నాడొక కుర్రవాడు సమీరుణ్ణి ఓదారుస్తూ.

''అరవకండి!'' అని సైగచేసి, ''ఈ బండ చాటున దాక్కుందాం రండి,'' అంటూ అపూర్వుడు ముందుకు నడిచాడు.

క్షణంలో ఏడుగురూ గుట్టు చప్పుడు కాకుండా, పెద్దబండ చాటున దాక్కున్నారు.

బండకవతలి వైపునుంచి, ఎవరో బిగ్గరగా నవ్వడం వినిపించింది. అపూర్వుడు ఆ శబ్దాన్ని జాగ్రత్తగా వినసాగాడు.

''ఈనాటికి, అంటే పది సంవత్సరాల తరవాత, మన కోరిక నెరవేరింది. మన కలలు ఫలించి, నిధి మనవశమయింది. మనకు అడ్డుపడిన శత్రువులు ఈపాటికి నరకంలో ఏడుస్తూ వుంటారు!'' అన్న కఠోర కంఠస్వరం వినిపించింది.

''అందరూ నరకంలో లేరు, గురూ, ఇంకా కొందరు జైళ్ళలోనే ఉన్నారు!'' అన్నాడు మరొకడు నవ్వుతూ.

''ఆలస్యం చేయకండి. త్వరగా మనం నిధిని పడవలోకి చేర్చాలి!'' అని అజ్ఞాపించాడు ఒకడు దృఢమైన కంఠస్వరంతో.

''నాకు ఆకలి వేస్తున్నది. మొదట కడుపునిండా తినాలి. ఆ తరవాతే మరొక పని. మన వశమైన నిధి రెక్కలొచ్చి ఎక్కడికీ ఎగిరిపోదులే!'' అన్నాడు ఇంకొకడు.

''ముందు, వచ్చిన పని పూర్తిచేయండి. నిధిని పడవలోకి చేర్చి, ఆ పిమ్మట కావలసినంత తినవచ్చు, తాగవచ్చు!'' అని అజ్ఞాపించాడు మొదటివాడు.

అపూర్వుడు బండల మధ్య సందు గుండా తొంగి చూశాడు. బండకు అవతలి వైపున ఐదుగురు దృఢకాయులు నిలబడి ఉన్నారు. నగలు నిండిన పెట్టెలు గుహ లోపలి గోతులలో ఉన్నాయి. సముద్రపు దొంగలు ఆ పెట్టెలను ఒక్కొక్కటిగా వెలుపలికి తీసి, పడవలోకి చేర్చడం కనిపించింది.

వాళ్ళ పని పూర్తికావడానికి అరగంట సేపు పట్టింది.

''సరే, ఇప్పుడు రండి భోజనం చేద్దాం!'' అని ఆజ్ఞాపించాడు వాళ్ళ నాయకుడు.

ఇద్దరు దృఢకాయులు, పాత్రల నిండుగా వున్న వంటకాలనూ, పీపాల నిండా వున్న పానీయాన్నీ పడవ నుంచి దించి, తెచ్చి ఒక చదునైన బండ మీద పెట్టారు. వాటి చుట్టూ కూర్చుని దొంగలు, సంతోషంగా తింటూ, తాగుతూ, ఆడుతూ, పాడుతూ పట్టరాని ఆనందంతో విచ్చల విడిగా ప్రవర్తించసాగారు. కొంత సేపటికి సద్దుమణిగింది. వాళ్ళందరూ స్పృహ కోల్పోయి అలాగే నిద్రపోయారు!

''రండి, మనం తప్పించుకోవడానికిదే సరైన తరుణం!'' అన్నాడు అపూర్వుడు ముందుకు నడుస్తూ.

''గండుమీనాలెక్కడ?'' అన్నాడు ఒక కుర్రవాడు.

"అవి సముద్రంలో హాయిగా ఉన్నాయి. అయినా, మనం ఇప్పుడు అమూల్యమైన నిధిగల ఆ పడవలో ప్రయాణం చేద్దాం!'' అంటూ అపూర్వుడు దొంగలు తెచ్చిన పడవకేసి చేయి చూపుతూ అటుకేసి నడిచాడు.

కుర్రవాళ్ళు అమితోత్సాహంతో పరుగున వెళ్ళి, పడవలోకి ఎక్కారు. మరుక్షణమే గండుమీనాలు వచ్చి, తమ తలలతో పడవను ముందుకు తోశాయి. కుర్రవాళ్ళు తెడ్లను అందుకున్నారు. సముద్రపుదొంగలు తప్పతాగి, స్పృహతప్పి పడిపోయిన శిలా ద్వీపాన్ని వదిలి, పడవ తీరం కేసి వేగంగా కదలసాగింది. —(ఇంకావుంది)





# అధికారదాహం!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వెవరికోసం, ఇంత అర్ధరాత్రివేళ ఇన్ని శ్రమలకు గురి అవుతున్నావో, నాకు తెలియడం లేదు. ఈ లోకం చాలా చిత్రమైంది. కీర్తిదాహంతో, అధికారవ్యామోహంతో స్వజనాన్ని పణం పెట్టినవాడు కూడా, ఒక్కొక్కసారి కొందరు స్వార్థపరులచేత మహాత్యాగీ, సధర్ముడూ అని శ్లాఘింపబడతాడు. ఒకవేళ నువ్వు సారహీనమైన అలాంటి కీర్తికాంక్షగలవాడివైతే, హెచ్చరికగా వుండేందుకు లోకనాథుడనేవాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు :

## బేతాళ కథలు



ఒకానొకప్పుడు కోసలరాజ్యమందలి, సిరిపురమండలంలోని చంద్రగిరి అనే గ్రామంలో, లోకనాధుడనేవాడు గ్రామాధికారి దగ్గిర నౌకరుగా వుండేవాడు. ఒక నాడు వాడు గ్రామాధికారితో, ''అయ్యా, సంసారసాగరాన్ని నేనొక్కణ్ణీ ఈదలేకుండా వున్నాను. దయతలచి నా పెద్ద కొడుక్కు ఏదైనా పని ఇప్పించండి,'' అన్నాడు.

గ్రామాధికారి నవ్వి, ''నీకు తెలియని ఉద్యోగం, ఈ చిన్న గ్రామంలో ఏమున్నది? అంత కావాలనుకుంటే ఒక పని చెయ్యి. నీ ఉద్యోగం మానెయ్యి, దాన్ని నీ కొడుక్కు ఇస్తాను,'' అన్నాడు.

ఈ విషయం తెలిసి లోకనాధుడి భార్య, భర్తతో గొడవపడింది. తన భర్తకు ఉద్యోగం పోతే, గ్రామంలో ఆయన అంటే ఎవరూ లెక్కచేయరనీ, కోడలు తనను చులకన చేస్తుందనీ ఆవిడ భయం. కాని, లోకనాధుడు భార్య మాట పెడచెవిని పెట్టి, తన ఉద్యోగాన్ని పెద్ద కొడుక్కు ఇప్పించాడు.

ఉద్యోగం పోయాక లోకనాధుడు, అదనంగా కొంత పొలం కౌలుకు తీసుకుని, చిన్నకొడుకుతో కలిసి సాగు చెయ్యసాగాడు.

ఆ సమయంలో అనుకోకుండా, ఆ గ్రామానికి ఏదో పనిబడి, సంపన్నుడైన లోకనాథం దూరపుబంధువు వచ్చాడు. మాటల సందర్భంలో లోకనాధుడు, ఆయనతో, ''ఎన్ని వుంటేనేం, ఎంతో ముఖ్యమైన గ్రంథాలయం మాత్రం, మా గ్రామంలో లేదు. విద్య లేనివాడు వింత పశువు కదా! నువ్వు పూనుకుంటే, గ్రంథాలయం ఎంతపని!'' అన్నాడు.

లోకనాధుడి బంధువు తలాడిస్తూ, ''సరే, లోకనాథా! గ్రంథాలయ భవనం కట్టించి, మంచి పుస్తకాలు కూడా తెప్పించి ఇస్తాను. దాన్ని నడిపేందుకు ఎవరైనా ఉచితంగా పని చేస్తారేమో చూడు. వాడికి జీతభత్యాలు కూడా, నన్నే

ఇచ్చుకోమంటే మాత్రం పొసగదు,'' అన్నాడు.

లోకనాధుడు గ్రామంలోని నలుగురు పెద్దల్ని కలిసి, గ్రంథాలయంలో ఉచితంగా పని చేసేవాడెవడైనా దొరుకుతాడా, అని అడిగాడు.

''చేతిలో వెన్న పెట్టుకుని, నెయ్యి కోసం దేవురించడం దేనికి? నీ చిన్న కొడుకు చదువుకున్నవాడేకదా! వాడినే ఆ పని చెయ్యమను,'' అని వాళ్ళు ఉచిత సలహా ఇచ్చారు.




కొత్తగా కట్టిన గ్రంథాలయం బాధ్యత వల్ల, లోకనాధుడి చిన్న కొడుకు తండ్రికి పొలం పనుల్లో సాయం చేయలేక పోయాడు. ఇంటి బాధ్యత అంతా లోకనాధుడి ఒక్కడిమీదేపడింది. దానితో ఋణభారం పెరగసాగింది.

ఒకనాడు సిరిపుర మండలాధ్యక్షుడు, చంద్రగిరి గ్రామాధికారిని పిలిపించి, ''మీ గ్రామ భూముల్లో అభ్రకం వుందని తెలియవచ్చింది. మీ గ్రామస్థుల్ని ఎక్కడికైనా తరలించి, అక్కడ తవ్వకాలు ప్రారంభించు,'' అన్నాడు.

''క్షమించండి! మా గ్రామస్థులకు అన్యాయం చేయలేను. మీరు చెప్పినపని చేయడం, నావల్ల కాదు,'' అన్నాడు గ్రామాధికారి.

ఈ వార్త తెలిసి, మర్నాడే లోకనాధుడు సిరిపురం మండలాధ్యక్షుణ్ణి కలిసి, ''అయ్యా, ఆ పని నాకప్పగించండి, చేయిస్తాను,'' అన్నాడు వినయంగా.

మండలాధ్యక్షుడు అప్పటికప్పుడే, లోకనాధుడికి సంబంధించిన అధికారాలను ఆదేశిస్తూ, ఉత్తర్వులు జారీ చేశాడు. లోకనాధుడు గ్రామస్థుల్ని ఇళ్ళు ఖాళీ చేయమన్నాడు. ఇందుకు వాళ్ళు ఒప్పుకోక ఎదురు తిరిగారు. అయితే, లోకనాధుడు ఏమాత్రం సంకోచించకుండా, పెద్ద సంఖ్యలో రాజభటుల్ని పిలిపించి, తన గ్రామస్థులందర్నీ వేరే ప్రాంతానికి తరలించాడు. అలా ఇళ్ళు

ఖాళీ చేసిన పోయినవారికి, తనకు తోచిన విధంగా నష్టపరిహారం ఇప్పించాడు. అయితే, గ్రామస్థులంతా అతణ్ణి నానా దుర్భాషలాడారు.

ఇది జరిగాక సిరిపురం మండలాధ్యక్షుడు, లోకనాధుణ్ణి బహిరంగ సభలో ఎంతగానో శ్లాఘించి, పునరావాస కారణంగా కొత్తగా ఏర్పడిన గ్రామానికి, అతణ్ణి అధికారిగా నియమించాడు.

కొంతకాలం జరిగింది.

కోసలరాజు, సిరిపుర మండలంగుండా ప్రవహించే ఒక నది మీద, ఆనకట్ట కట్టదలిచాడు. దానివల్ల, ఆ మండలంలోని ఎన్నో గ్రామాలు నీట మునిగిపోతాయి. ఆ విషయం గురించి చర్చించడానికి, కోసలరాజు సిరిపురం మండలాధ్యక్షుణ్ణి పిలిపించాడు.

''మహారాజా, క్షమించాలి! ఈ ప్రయత్నానికి ప్రజల మద్దతు వుండదు. బలప్రయోగం ద్వారా, ఈ పని పూర్తి చేయాలనుకుంటే, ప్రజల్లో కల్లోలం బయలుదేరుతుంది.'' అన్నాడు మండలాధ్యక్షుడు వినయంగా.

కోసలరాజు, తన పథకాన్ని ఏవిధంగానైనా అమలుచేయాలనే కృతనిశ్చయంతో వున్నాడని విని, లోకనాధుడు వెళ్ళి ఆయన దర్శనం చేసుకుని, ''మహారాజా, తమరి ఆజ్ఞ అయితే, ఈ ఆనకట్ట నిర్మాణాన్ని నేను పూర్తిచేయించగలను,'' అన్నాడు.



రాజు సంతోషించి, ప్రజల్లో కల్లోలం బయలుదేరుతుందని చెప్పిన మండలా ధ్యక్షుణ్ణి తొలగించి, ఆస్థానంలో లోక నాథుణ్ణి నియమించాడు.

పదవీబాధ్యతలు స్వీకరించగానే లోక నాథుడు, నీటి ముంపుకు గురి అయ్యే గ్రామాల ప్రజల్ని, బలవంతంగా ఇళ్ళ నుంచి ఖాళీ చేయించబోయాడు. మండల ప్రజల్లో తీవ్రమైన అసంతృప్తి కలిగి, వాళ్ళు తిరుగుబాటుకు పూనుకున్నారు. కాని, లోకనాథుడు వందల సంఖ్యలో రాజభటుల్ని రప్పించి, ఆ తిరుగుబాటును అణచివేశాడు. సిరిపురం మండలవాసులు లోకనాథుణ్ణి స్వార్థపరుడనీ, పదవికోసం ఎంతకైనా తెగిస్తాడనీ నిందించారు.

కొన్ని నెలల తర్వాత ఆనకట్ట నిర్మాణం పూర్తయింది. ప్రారంభోత్సవం నాడు కోసలరాజు, లోకనాథుణ్ణి త్యాగి అనీ, ప్రజాసేవకుడనీ, సధర్ముడనీ కొని యాడాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, లోకనాథుడి ప్రవర్తన గురించి, నీ అంచనా ఏమిటి? అతడు ఒక్క పెద్ద కొడుకు విషయంలో మాత్రం, తన ఉద్యోగాన్ని త్యాగం చేసి, వాడికిప్పించాడు. తర్వాత అతడు చేసినవన్నీ కీర్తికాంక్ష, అధికార దాహం కొద్దీ చేసినవే గదా? అధికార పదవిలో ఒక్కొక్క మెట్టే పైకెక్కేందుకు, అతడు తన గ్రామప్రజల్నీ, మండల వాసుల్నీ—అందర్నీ నానా ఇబ్బందుల



పాలు చేశాడు. వాళ్ళ అసంతృప్తిని బల ప్రయోగం ద్వారా అణచివేశాడు. అలాంటివాణ్ణి, రాజు అంతగా పొగడడం అర్థరహితం కాదా? అది ఆయన స్వార్థ బుద్ధినీ, ప్రజలపట్ల అతడికి గల నిరాదరణనూ తెలియజేయడం లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''లోకనాధుడికి అధికారదాహం, కీర్తివ్యామోహం; అలాగే రాజుకు స్వార్థచింతనా, ప్రజల పట్ల నిరాదరణా అంటగట్టడం ఏమాత్రం న్యాయంకాదు. అభ్రకం అనేది చాలా అరుదైన ఖనిజం. దానివల్ల దేశ ఆర్థిక వ్యవస్థ ఎంతగానో బలపడుతుంది. నదుల జలాలు వృథాగాపోయి సముద్రంలో కలవకుండా, వాటికి ఆనకట్టలు కట్టడం ద్వారా, దేశంలో మరింతగా వ్యవసాయాభివృద్ధి కలిగించవచ్చు. దాని ద్వారా దేశ సంపద మరింత పెరుగుతుంది. ఈ పథకాల వల్ల మొదట్లో ప్రజల్లో కొందరికి ఇబ్బందులు కలిగినా, ఆ తర్వాత దేశం సుసంపన్నమౌతుంది. కోసలరాజు ఇదంతా ఆలోచించే, అందుకు తగిన పథకాలు తయారు చేశాడు. అయితే, వాటి అమలు విషయం వచ్చినప్పుడు, ముందు గ్రామాధికారీ, తర్వాత మండలాధ్యక్షుడూ ప్రజలకోపానికి భయపడి, తమ బాధ్యతలనుంచి వైదొలిగారు. లోకనాధుడు మాత్రం, ఈ పథకాల వల్ల ఆదిలో ప్రజలు అసంతృప్తులైనా, తర్వాత వాటి ప్రయోజనాన్ని గుర్తించగలరనే విశ్వాసంతో, వాటి అమలుకు పూనుకున్నాడు. కొందరు వ్యక్తులు అధికారం కోసం గొప్ప పనులు చేయరు. కాని, గొప్ప పనులు చేసేవారికి అధికారం, కీర్తీ రెండూ వెన్నంటి నీడలా వస్తాయి. లోకనాధుడి విషయంలో జరిగింది ఇదే!'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : డా॥ కాటిచెర్ల గురురామప్రసాద్]





## నిజాయితీపరుడు

ఖలీఫా హారూన్ అల్‌రషీద్ తర్వాత బాగ్దాద్ నగరాన్ని పరిపాలించిన వారిలో అబ్దుల్ అజీజ్ ముఖ్యుడు. ఆయన స్వతహాగా మంచివాడు. అంతేగాక దాన ధర్మాలు చేయడంలో అతని చేతికి ఎముక లేదని ప్రతీతి. ఆ పాదుషా విధించే శిక్షలు చిత్రంగా ఉండేవి. కొరడా దెబ్బలు, కారాగారశిక్ష, ఉరిశిక్ష వంటివి విధించేవాడు కాదు. ప్రజలు చేసిన తప్పుపని వారి మనసులో బాగా నాటుకుపోయేటట్టు, తెలిసేటట్టు చేసి చాతుర్యంగా తీర్పు చెప్పేవాడు. దానితో తప్పు చేసినవాడికి అవమానమై తిరిగి అటువంటి పని జన్మలో చేసేవాడు కాదు. ఆ రాజులో ఉన్న మరో గుణమేమిటంటే నిజాయితీగా నడుచుకునే వారికి తగిన బహుమానాలిచ్చి సత్కరించేవాడు. అందువల్ల అతని కాలంలో దొంగతనాలు గాని, ఇతర అవినీతికరమైన పనులుగాని చాలా తక్కువ జరిగేవి.

ఒక రోజు అబ్దుల్ అజీజ్‌కు చాలా కాలం తర్వాత మగపిల్లవాడు పుట్టడంతో సంతోషంగా పేదప్రజలకు విరివిగా దాన ధర్మాలు చేశాడు. అలా ఆయన వద్ద నుంచి ఒక బస్తా ధాన్యం తీసుకున్న ఓ పేదవాడు ఇంటికి పోయి బస్తా విప్పాడు. ధాన్యం లోపల వాడికి ఒక బంగారు నాణెం కనబడింది. వాడి భార్య అది చూసి, "ఎక్కడిది ఆ బంగారు నాణెం?" అని అడిగింది. వాడు జరిగినది చెప్పి, ఆ నాణాన్ని తిరిగి పాదుషాకు ఇవ్వాలనుకుంటున్నానని అన్నాడు.

''నీ మొహం! నీ బుద్ధిగాని గాలికి ఎగిరిపోలేదు కదా! నిక్షేపంగా వచ్చిన బంగారును తిరిగి పాదుషాగారికి ఇస్తావా?" అన్నది వాడి భార్య.

అరేబియా జానపద కథ

"సుభ్వారుకో! పొరపాటు వల్ల ఆ నాణెం ధాన్యం మూటలో వచ్చింది. అది మనం ఉంచుకోనడం న్యాయం కాదు. మంచిగా ఉన్నవాడికే ఏనాటికైనా న్యాయం లభిస్తుంది." అని వాడు, భార్య ఎంత మొత్తుకుంటున్నప్పటికీ వినక తీసు కెళ్ళి పాదుషాకిచ్చాడు.

అబ్దుల్ అజీజ్ ఆ పేద యువకుడి నిజాయితీకి మెచ్చి నూరు బంగారు నాణెములు ఇచ్చాడు.

ఇదంతా గమనించిన బషీర్ అనే ఓ షావుకారు బీదవాడి వేషం వేసుకుని యాభై బంగారు నాణెములు తన సొంతవి తీసుకొని పాదుషా వద్దకు వెళ్ళి ఎంతో వినయం నటిస్తూ, "మహాప్రభూ! మీరు నిన్న నాకు ఇచ్చిన ధాన్యం మూటలో ఈ ఏభై బంగారు నాణెములు దొరికాయి. వీటిని న్యాయంగా తిరిగి తెచ్చాను. దయ చేసి స్వీకరించండి," అన్నాడు, తనకు తిరిగి ఐదువందల బంగారు నాణెములు వస్తాయన్న ఆశతో.

అప్పుడు అబ్దుల్ అజీజ్ బషీర్ కేసి ఆశ్చర్యంగా చూశాడు. బషీర్ భోజన ప్రియుడు కావడంవల్ల మనిషి బొద్దుగా, పుష్టిగా, బలంగా ఉన్నాడు. పైగా పేద వాడి వేషం ధరించినా, కుడిచేతికున్న నాలుగు బంగారపుటుంగరాలూ, ఎడమ చేతికున్న రెండు వజ్రపుటుంగరాలూ తీయడం మర్చిపోయి అలానే వచ్చాడు. అవే అతని అసలు స్వరూపాన్ని పట్టి ఇచ్చాయి. బషీర్ నిజమైన పేదవాడు కాదనీ, ఎక్కువ బంగారు నాణెములు సంపాదించేందుకు వచ్చాడనీ గ్రహించ డానికి పాదుషాకు ఎంతోసేపు పట్టలేదు. అప్పుడాయన తన మంత్రితో, "మంత్రి గారూ! ఇతడు ఇచ్చిన బంగారు నాణె ములు తీసుకొని ఖజానాలో వేయండి. నిజాయితీగా వాటిని తిరిగి తెచ్చాడు గనుక ఇతని పేర ఓ నిజాయితీ పత్రం వ్రాసి ఇతనికిచ్చి పంపండి," అన్నాడు.

బషీర్ ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు!



# చందమామ
# అనుబంధం—36




మన దేవుళ్ళు.

## హనుమంతుడు

హనుమంతుడు నిర్మలమైన భక్తితో, దివ్యత్వాన్ని సాధించిన విశిష్ట దివ్యస్వరూపుడు. హనుమంతుడు శివాంశసంభూతుడు. శివశక్తియుతమైన దివ్యఫలాన్ని వాయుదేవుడు, తపోధనురాలయిన అంజనాదేవికి ప్రసాదించాడు. దాని పర్యవసానంగా ఆమెకు హనుమంతుడు జన్మించాడు. అందుకే ఆయనకు ఆంజనేయుడు అని పేరు వచ్చింది.

భగవద్భక్తితో సాధించలేనిది లేదని నిరూపించిన భక్తశిఖామణి హనుమంతుడు. నూరు యోజనాల సముద్రాన్ని అవలీలగా దాటి, సీతను కనుగొని ఆమెను ఓదార్చి, రావణుడి గర్వమణచి, సంజీవనీ పర్వతాన్ని సమూలంగా తీసుకువచ్చి లక్ష్మణుడి ప్రాణాలు రక్షించిన ధీరుడు వాయుకుమారుడైన హనుమంతుడు!

అద్భుతమైన శక్తియుక్తులకూ, అపూర్వమైన ధైర్యసాహసాలకూ, వినయవిధేయతలకూ పేరెన్నికగన్న మహనీయుడు హనుమంతుడు. అసంఖ్యాకులయిన భక్తులు చేసే నిరంతర రామనామస్మరణ వినడానికే ఆంజనేయుడు చిరంజీవిగా వెలుగొందుతున్నాడని భక్తులు విశ్వసిస్తారు. భక్తిశ్రద్ధలతో కొలిచేవారి బాధలు పోగొట్టే దివ్యమంగళస్వరూపుడు హనుమంతుడు అని భక్తులు భావిస్తారు!

# టైప్‌రైటింగ్‌లో ఛాంపియన్

బెల్జియం రాజధాని బ్రుసెల్స్‌లో గత జూలై నెలలో 'ఇంటర్నేషనల్ ఫెడరేషన్ ఫర్ షార్ట్‌హాండ్ అండ్ టైప్‌రైటింగ్' 39వ మహాసభ జరిగింది. ఆ సందర్భంగా 'ఇంటర్‌స్టెనో 1991' ఛాంపియన్‌షిప్ పోటీలు జరిపారు. ఆ పోటీలలో మన దేశానికి చెందిన అభిషేక్‌జైన్ అనే విద్యార్థి జూనియర్ (20 యేళ్ళకు లోబడినవారికి నిర్దేశించినది) ఛాంపియన్‌షిప్‌ను సాధించాడు!

పంజాబు రాష్ట్రంలోని జలంధర్ జిల్లా గొరయా పట్టణానికి చెందిన అభిషేక్ జైన్‌వయసు పదమూడేళ్ళే! అభిషేక్ నిమిషానికి 109.2 పదాలు టైప్ చేశాడు. 99.93 శాతం నిర్దుష్టంగా ఉన్నది. ఇది ఇరవై సంపత్సరాలకు పైబడిన వారికి జరిపిన పోటీలో పాల్గొని, ద్వితీయ స్థానం సాధించిన యువకునికన్నా ఉత్తమమని పరిశీలకులు అభిప్రాయ పడ్డారు.




అభిషేక్ నిమిషానికి 546 'స్ట్రోక్స్' వేగంతో టైపు చేయగలడు. వాటిలో 511 'స్ట్రోక్స్' నిర్దుష్టంగా ఉన్నాయి.

అభిషేక్ పదవ తరగతి చదువుతున్నాడు కాబట్టి, అతన్ని మన దేశంలో ఇంకా 'లోయర్ గ్రేడ్' పరీక్షలకు కూడా అనుమతించలేదు!

అభిషేక్ తండ్రి, టైప్‌రైటింగ్, షార్ట్‌హాండ్ నేర్పే ఒక 'కమర్షియల్ ఇన్‌స్టిట్యూట్‌ను' నడుపుతున్నాడు. అభిషేక్ రోజూ బడినుంచి రాగానే, ఇన్‌స్టిట్యూట్‌కు వెళ్ళి, టైప్‌రైటర్ దగ్గర కూర్చుని టైపు చేస్తూండేవాడు. దానిని గమనించిన తండ్రి కుర్రవాడికి అడ్డు చెప్పలేదు; ప్రోత్సహించాడు. ఇలా ఐదారు సంవత్సరాలు గడిచాయి. ఆలోగా అభిషేక్ జాతీయస్థాయి ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొనే స్థాయికి ఎదిగాడు. 1987వ సం॥లో జాతీయ బహుమతిని సాధించాడు. ఆ తరవాత కూడా తల్లిదండ్రుల ప్రోత్సాహంతో అతడు వివిధ పోటీలలో పాల్గొంటూ వచ్చాడు.

ఒక సుప్రసిద్ధ 'టైప్ రైటర్ కంపెనీ' ప్రోత్సాహంతో, అభిషేక్ జూలైలో బ్రుసెల్స్‌లో జరిగిన అంతర్జాతీయ టైప్‌రైటింగ్ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొన్నాడు. అందరి మన్ననలూ పొందాడు!

అభిషేక్ హిందీలో నిమిషానికి 75 పదాలూ, పంజాబీలో 80 పదాలూ టైపు చేయగలడు. టర్కీలోని ఇస్తాన్‌బుల్‌లో 1993లో జరుగనున్న 'ఇంటర్‌స్టెనో' పోటీలలో పాల్గొని, సరికొత్త రికార్డును సృష్టించి, 'గిన్నిస్ బుక్'లో స్థానం సంపాదించాలని అభిషేక్ కృషి చేస్తున్నాడు. ప్రస్తుతం అమెరికాలోని ఒక సంస్థ, తాను నిర్వహిస్తూన్న ఎలక్ట్రానిక్ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొనమని అభిషేక్‌ను ఆహ్వానించింది. అందువల్ల అతడు, ఇప్పుడు ఎలక్ట్రానిక్ టైప్ రైటింగ్‌లో శిక్షణ పొందుతున్నాడు. అభిషేక్ కృషి జయప్రదం కావాలని కాంక్షిస్తున్నాము!

# మీకు తెలుసా?

1. 'రోమునగరం తగలబడుతూంటే నీరో చక్రవర్తి ఫిడిల్ వాయించాడ'ని చెబుతారు. మరి నీరోచక్రవర్తి పూర్తి పేరేమిటో మీకు తెలుసా?
2. క్రీ. పూ. 6వ శతాబ్దానికి చెందిన ఒక భారతీయ విజ్ఞానవేత్తను 'ప్లాస్టిక్ సర్జరీ'కి మూల పురుషుడుగా చెబుతారు. ఆయన ఎవరు?
3. మొక్కల పెరుగుదలను కొలిచే పరికరాన్ని కనుగొన్న భారతీయ శాస్త్రవేత్త ఎవరు? ఆ పరికరం పేరేమిటి?
4. రాజు పుట్టుకతో అంధుడు. భర్త అంధుడు కావడం వల్ల, రాణి కూడా కళ్ళకు గంతలు కట్టుకున్నది. ఆ దంపతులెవరు?
5. అతి పెద్ద జెండా కలిగిన దేశం ఏది?
6. ఒలింపిక్ పతాకంలో, విభిన్న వర్ణాలలో ఐదు వృత్తాలు ఉన్నాయి. ఆ రంగులు ఏవి? వాటిని ఏ ఆధారంతో ఎంపిక చేశారు?
7. 1956వ సం॥లో సోవియట్ తపాలాబిళ్ళలపై ప్రప్రథమంగా ఒక భారతీయుడి చిత్రాన్ని ముద్రించారు. ఆయన ఎవరు?
8. 1906వ సం॥లో నోబెల్ బహుమతి పొందిన ఒక వ్యక్తి శిష్యులు, ఎనమండుగురు ఆ తరవాత వరసగా నోబెల్ బహుమతి పొందారు. ఆయన ఎవరు?
9. అమెరికా అధ్యక్షుడుగా అతి స్వల్పకాలం మాత్రమే పదవీ బాధ్యతలు వహించిన వారెవరు?
10. 'డెడ్‌సీ' లోతెంత?
11. 'బ్లూక్రాస్ సొసైటీ ఆఫ్ ఇండియా' స్థాపకులెవరు?
12. 'దీనబంధు', 'దేశబంధు' అని పేరుగాంచిన వాళ్ళెవరు?

## సమాధానాలు

1. క్లాడియస్ సీజర్ డ్రూసస్ జర్మానికస్.
2. సుశ్రుతుడు.
3. జగదీశ్ చంద్రబోస్. క్రెస్కోగ్రాఫ్.
4. ధృతరాష్ట్రుడు, గాంధారి.
5. బ్రెజిల్, రాజధాని బ్రాసీలియాలో ఎగిరే పతాకం వెడల్పు 229 అడుగులా 3 అంగుళాలు; పొడవు 328 అడుగులా 1 అంగుళం.
6. నీలం, పసుపుపచ్చ, ఆకుపచ్చ, ఎరుపు, నలుపు. ప్రపంచంలోని అన్ని దేశాల జెండాలలోనూ, ఈ రంగులలో కనీసం ఏదో ఒక రంగయినా వుంటుంది.
7. కాళిదాసు.
8. జె. జె. థాంప్సన్.
9. విలియం హెన్రీ హారిసన్. ఆయన 1841వ సం॥లో రెండు గంటలసేపు వర్షంలో తడుస్తూ నిలబడి ప్రారంభ ఉపన్యాసం ఇచ్చాడు. సన్నిపాత జ్వరం పట్టుకుని, 32 రోజులలో మరణించాడు. ఆయనొక వైద్య నిపుణుడు!
10. 395.9 మీటర్లు. అదే భూమి మీద అట్టడుగు స్థానం.
11. కేప్టెన్ వి. సుందరం. 1964లో జంతు రక్షణ కోసం స్థాపించాడు.
12. సి. ఎఫ్. ఆండ్రూస్; సి. ఆర్. దాస్.

## కొలంబస్ కన్నా పూర్వం!

క్రిస్టఫర్ కొలంబస్ 1492 వ సం॥లో అమెరికాను కనుగొనడానికి 500 సంవత్సరాలకు పూర్వం లీఫ్ ఎరిక్సన్ అనే నార్వే నావికుడు, గ్రీన్‌లాండ్ నుంచి బయలుదేరి ఉత్తర అమెరికాలో దిగాడని చెబుతారు. ఈ మొదటి సముద్రప్రయాణ జ్ఞాపకార్థం, 9 వ శతాబ్దం 'వైకింగ్ ఓడ' నమూనాలో ఒక ఓడను తయారు చేశారు. అది గత మే నెల 3 వ తేదీన, నార్వే నుంచి బయలుదేరింది. ఆ ఓడ క్రీ॥ శ॥ 1000 వ సం॥లో ఎరిక్సన్ వెళ్ళిన మార్గంలో ప్రయాణం చేసి 'కొలంబస్‌దిన'మైన అక్టోబర్ 12 వ తేదీకి అమెరికాను చేరుకోగలదని భావిస్తున్నారు!




# చందమామ కబుర్లు




## 'అహింసా' విశ్వవిద్యాలయం

అమెరికాలోని జైనులు న్యూజెర్సీలోని బ్లెయిర్స్ టౌన్‌లో అహింసా సిద్ధాంతాలను బోధించే విశ్వవిద్యాలయాన్ని స్థాపించడానికి సన్నాహాలు జరుపుతున్నారు. కోస్టారికాలోని 'శాంతి విశ్వవిద్యాలయం' నమూనాలో రూపొందించనున్న ఈ విశ్వవిద్యాలయంలో సంస్కృతి, చరిత్ర, నాగరికత, మనస్తత్వం మొదలైన విషయాలను బోధిస్తారు!

అమెరికాలోని వాషింగ్టన్ విశ్వవిద్యాలయంలో 'టాగూర్' అధ్యయన పీఠాన్ని ఏర్పరుస్తున్నారు. రవీంద్రనాథటాగూర్ జీవిత విశేషాలనూ, సాహిత్యాన్నీ, కళాన్ని అధ్యయనం చేయడానికి అక్కడ అవకాశం కల్పిస్తున్నారు.




# అచ్చయ్య మంచితనం

అచ్చయ్య అనే వాడికి చిన్నతనంలోనే తల్లి పోయింది. తండ్రి వాణ్ణి ముద్దుగా పెంచాడు. అచ్చయ్య కూడా అల్లరిచిల్లరగా వుండక, తండ్రి చెప్పిన మాటే వింటూ బుద్ధిమంతుడనిపించుకున్నాడు. అయితే వాడికి వ్యవహారజ్ఞానం బొత్తిగా లేదు. స్వంతంగా ఏ పనీ చేయలేక అన్నిటికీ తనమీదనే ఆధారపడిన కొడుకు గురించి తండ్రికి బెంగగా వుండేది. అవసానదశలో ఆయన కొడుకును దగ్గిరకు పిలిచి, "నాయనా! నీకు అన్ని పనులూ వచ్చు. దురలవాట్లులేవు. నలుగురితో మంచిగా వున్నావంటే చాలు. నీకేలోటూ వుండదు," అని చెప్పి కన్నుమూశాడు.

ఈ మాటలు అచ్చయ్య తలకెక్కాయి.

ఒక రోజున వాడు, రామశాస్త్రి అనే పండితుడికి రాజసన్మానం జరిగిందని తెలిసి, పనిగట్టుకుని ఆయన ఇంటికి వెళ్ళి, "అయ్యా! తమరు మహా పండితులు. రాజసన్మానానికి తగినవారు. మీకు జరిగిన సన్మానానికి, నాకెంతో సంతోషంగా వుంది," అన్నాడు.

మంచివాళ్ళు ఎదుటివారి అదృష్టానికి సంతోషించాలని వాడి ఉద్దేశ్యం!

అయితే రామశాస్త్రి వాడికేసి కళ్ళెర్ర చేసి చూసి, "పాండిత్యం గురించి నీకేం తెలుసు? నేను రాజసన్మానానికి తగిన వాడినో, కాదో నిర్ణయించే అర్హత నీకుందా? ఇంకెప్పుడూ నీకంటే గొప్ప వాళ్ళ దగ్గర ఇలా ఆలోచించకుండా మాట్లాడకు," అన్నాడు.

అచ్చయ్య చిన్నబుచ్చుకుని అక్కణ్ణించి వచ్చేస్తూంటే, దారిలో వాడికి గ్రామాధికారి కనిపించాడు. ఆయన చుట్టూ గ్రామ పెద్దలున్నారు. అంతకు ముందు రోజు గ్రామాధికారి ఏదో తగాదా విషయంలో

"వసుంధర"



చక్కని తీర్పు ఇచ్చాడని, వాళ్ళు ఆయనను అదేపనిగా మెచ్చేసుకుంటున్నారు. అచ్చయ్య మాత్రం ఆయనకు నమస్కరించి వూరుకున్నాడు.

గ్రామాధికారి వాడివంక గుర్రుగా చూసి, "ఏరా, నా తీర్పు గురించి నీకేమీ అనిపించలేదా? అలా చూస్తూ బెల్లంకొట్టిన రాయిలా వుండిపోయావు," అన్నాడు.

ఏం చెప్పాలో తెలియక, అచ్చయ్య చల్లగా అక్కణ్ణించి జారుకున్నాడు. కొందరు సరిసమానుల నుంచే పొగడ్తల నాశిస్తారు. కొందరు ఎలాంటివారు పొగిడినా సంతోషిస్తారు. కానీ ఈతేడా తెలుసుకోవడమెలా ?

అచ్చయ్య సాటిరైతు బుచ్చయ్య వద్దకు వెళ్ళి, "వ్యవసాయంలో నీకు నువ్వేసాటి. నీ చేతిలో ఏదో మంత్రముంది. నువ్వు నాటిన విత్తనాలు బంగారం పండిస్తాయి," అన్నాడు.

బుచ్చయ్య నవ్వి, "ఏమిటి అచ్చయ్యా, ఈ రోజు వచ్చీరాగానే, అదేపనిగా పొగిడేస్తున్నావు. నాతో ఏమైనా పని వుందా ?" అన్నాడు.

అచ్చయ్య చిన్నబుచ్చుకుని, "పనుంటే కానీ పొగడకూడదా ? నీలో గొప్పతన ముంటే, ఒక మంచి మాట అనకూడదా?" అని అడిగాడు.

"నీకంతగా పొగడాలనుంటే, మన గ్రామాధికారిని పొగుడు. పనులున్నవాళ్ళు అడ్డమైనవాటికీ ఆయన్ని పొగిడి కార్యం సాధించుకు వస్తూంటారు. అలా పొగిడే వాళ్ళను కాకారాయుళ్ళని అంతా హేళన చేస్తారు. నువ్వలా కాకారాయుడి వనిపించుకోవాలనుందా ?" అన్నాడు బుచ్చయ్య.

సరిసమానులనైనాసరే పొగిడితే హేళనగా వుంటుందని అచ్చయ్యకు అర్థమై, ఇంకెవర్నీ దేనికీ పొగడకూడదనుకున్నాడు.

ఒక రోజున అచ్చయ్యకు కడుపు నొప్పిగా వుంటే, వైద్యుడి వద్దకు వెళ్ళాడు.

వైద్యుడా సమయంలో బాగా దెబ్బలు తిన్నవాడి కొకడికి, గాయాలను శుభ్రం చేసి కట్లు కడుతున్నాడు.

''గాయాలెలాగయినై ?'' అని అడిగాడు అచ్చయ్య.

రెచ్చిపోయిన ఎద్దొకటి వాణ్ణి తరిమి తరిమి కుమ్మిందిట! విషయం విని అచ్చయ్య మౌనంగా వూరుకుంటే, వైద్యుడు కోపంగా, ''అచ్చయ్యా! అయ్యో, పాపమని జాలిగా ఒక మాటయినా అనాలని, నీకు తెలియుదా ?'' అని మందలించాడు.

కష్టాల్లో వున్నవాళ్ళను చూసి జాలిపడినా, అది మంచితనమేనని అచ్చయ్య కర్థమయింది.

ఆ తర్వాత వాడు ఇల్లు కాలిపోయి ఏడుస్తున్న భద్రయ్య అనే వాడి వద్దకు వెళ్ళి, ''అయ్యో, పాపం! ఇల్లు కాలి నీకున్నదంతా పోయినట్టుంది. నీ పరిస్థితి చూస్తుంటే నాకు చాలా బాధగా వుంది,'' అన్నాడు.

భద్రయ్య మండిపడుతూ, ''అడ్డమైన వాళ్ళూ వచ్చి నాలుగు జాలికబుర్లు చెప్పేవాళ్ళే! దమ్మిడీ సాయం చేసేవాళ్ళు మాత్రం లేరు,'' అన్నాడు.

అచ్చయ్య దగ్గర డబ్బు లేదు. అందుకని వాడు కిమ్మనకుండా అక్కణ్ణించి వెళ్ళిపోతూ, ''కష్టాల్లో వున్నవాళ్ళ మీద జాలిపడితే చాలదు. సాయపడగలప్పుడే ఆ పని చేయాలి!'' అనుకున్నాడు.





ఇలా వుండగా లక్షాధికారి రమణయ్య ఇంట్లో దొంగతనం జరిగి, పాతికవేల వరహాలు పోయాయి. ఆయన లబోదిబో మంటూంటే, ఒక్కొక్కరే ఆయనింటికి వెళ్ళి ఓదార్చివస్తున్నారు.

అచ్చయ్య కూడా రమణయ్య ఇంటికి వెళ్ళి, "అయ్యా! జరిగిందేదో జరిగి పోయింది. విచారించి ఏం ప్రయోజనం? తమకు కలిగిన నష్టం సామాన్యమైనది కాదు. ఏదో విధంగా మీకు సాయపడాలని వుంది. కావాలంటే ఈ సంవత్సరం తమ పొలాల్లో రెండెకరాలు ఉచితంగా దున్ని పెట్టి, తమకు నా వంతుగా సాయపడ గలను," అని తన మాటగా చెప్పాడు.

అంత దుఃఖంలోనూ రమణయ్య దీనికి మండిపడి, "ఏరా! పాతికవేల వరహాలు పోగానే అడుక్కుతినేవాణ్ణయిపోయాననుకుంటున్నావా? నీచేత సాయం చేయించుకునేటంత దిగజారిపోయాననుకుంటున్నావా? నీ స్థితికి నేను దిగజారిపోవాలని నీ వెధవకోరిక అయితే, ఇప్పుడే చెబుతున్నాను, విను! ఇలాంటి దొంగతనాలు పది జరిగినా, నేను నీకంటే వెయ్యిరెట్లు గొప్పగానే వుంటాను. తెలిసిందా?" అన్నాడు.

అక్కడున్న వాళ్ళందరూ కూడా దుఃఖంలో వున్న పెద్దవాళ్ళతో మాట్లాడే పద్ధతి అదేనా అంటూ, అచ్చయ్యను గట్టిగా మందలించారు.

ఇంత జరిగాక అచ్చయ్యకు, ఈ లోకంలో మంచిగా ఎలా జీవించాలా అన్న దిగులు పట్టుకుంది.

ఒక రోజు వాడు, ఊరి చివర మర్రి చెట్టుకింద కూర్చుని ఆలోచిస్తూండగా, సాధువొకడు వాణ్ణి చూసి, "ఏం నాయనా! అలా దిగులుగా వున్నావు?" అంటూ పలకరించాడు.

అచ్చయ్య, సాధువుకు తన బాధ చెప్పుకున్నాడు.

సాధువు చిన్నగా నవ్వి, "నీలో మంచివాడనిపించుకోవాలనే తాపత్రయం

ఎక్కువగా వుంది. అందుకే నువ్వు నలుగురి మధ్య నవ్వుల పాలయ్యావు,'' అన్నాడు.

''స్వామీ, నా కోరికలో తప్పుందా ?'' అని అడిగాడు అచ్చయ్య.

''నీ కోరికలో తప్పులేదు. కానీ ఎదుటి వాడిలో వున్న మంచితనాన్ని గుర్తించక, లేని చెడ్డతనాన్ని ఊహించుకునేవారే ఎక్కువ. అది లోకం తీరు,'' అన్నాడు సాధువు.

''కానీ మా నాన్న నన్ను నలుగురితోనూ మంచిగా వుండమని చెప్పి, చనిపోయాడు. అది నాకు సాధ్యం కాదా ?'' అన్నాడు అచ్చయ్య.

''ఎందుకు సాధ్యం కాదు ? నువ్వు మంచివాడి వనిపించుకోవడం కోసం, ఎవరినీ పొగడనక్కర్లేదు, పనిగట్టుకుని ఎవరిమీదా జాలిపడనక్కర్లేదు,'' అన్నాడు సాధువు.

''మరేం చెయ్యాలి ?'' అని అడిగాడు అచ్చయ్య.

''అందరితోనూ మంచిగా వుండు, అంతే !'' అన్నాడు సాధువు.

''అదెలాగో నాకు తెలియదు, స్వామీ!'' అన్నాడు అచ్చయ్య.

''నీ కెవరినైనా మెచ్చుకోవాలనిపిస్తే మెచ్చుకో. ఎవరిమీదైనా జాలి కలిగితే జాలిపడు. అంతేగాని, కేవలం మంచి వాడనిపించుకునేందుకు మాత్రం, ఆ పనులు చెయ్యకు. అడిగినవాళ్ళకు చేత నైన సాయం చెయ్యి. నిన్ను తిట్టిన వాళ్ళను క్షమించు. అకారణంగా నువ్వెవరినీ తిట్టకు. నువ్వు మంచిగా వున్నంతకాలం, నీ గురించి ఎవరేమను కున్నా బాధపడకు. అర్థమయిందా ?'' అన్నాడు సాధువు.

దానితో అచ్చయ్యకు జ్ఞానోదయ మయింది. స్వతహాగా మంచివాడు కావడంవల్ల, వాడు సాధువు చెప్పినట్లే నడుచుకుని, ఊళ్ళో అందరిచేతా మంచి వాడనిపించుకుని కలకాలం సుఖంగా జీవించాడు.





# దానఫలం

మలయవతీరాజు సర్వోత్తముడికి, అప్పు డప్పుడూ మంత్రి సుమేధుడితో కలిసి, మారువేషంలో తన రాజ్యపౌరులమధ్య తిరుగుతూ, వాళ్ళ కష్టసుఖాలు ప్రత్యక్షంగా తెలుసుకునే అలవాటుండేది.

ఈ విధంగా ఒకసారి ఆయన నగరంలో సంచరిస్తూండగా, ఒక సంఘటన జరిగింది. బాట మీద ఇద్దరు స్నేహితులు వెళుతూ, పక్కన చెట్టుకింద కూర్చుని అడుక్కుంటున్న ఒక అవిటివాణ్ణి చూశారు. ఆ సమయంలో మొదటివాడు అవసరానికి తన దగ్గిర డబ్బు లేకపోవడంతో, రెండవవాడి వద్ద ఒక కాసు అడిగి తీసుకుని, ఆ అవిటివాడికి ధర్మం చేశాడు. ఆ కాసును ఇంటికి వెళ్ళాక తిరిగి ఇస్తానని మొదటివాడు అంటే, దానికి రెండవవాడు ఒప్పుకోక, "ఆ డబ్బు నువ్వు దానం చేశావు కాబట్టి, నాకేం తిరిగి ఇవ్వవలసిన అవసరం లేదు. ఒక వేళ నువ్వు ఇచ్చినా, నేను తీసుకోను," అన్నాడు.

ఈ సంఘటన సర్వోత్తముణ్ణి చాలా ఆలోచింపచేసింది. ఆ ఇద్దరిలో ఎవరికి, ఆ కాసును దానం చేసిన ఫలం దక్కుతుంది? అన్నది ఆయనకు ఎదురైన ప్రశ్న. ఆ రాత్రంతా ఎంత ఆలోచించినా ఆయనకు సంతృప్తికరమైన సమాధానం తట్టలేదు.

మర్నాడు ఆయన సభికుల సమక్షంలో, ఆ సంఘటనను వివరించి, "ఆ ఇద్దరిలో ఎవరికి, ఆ ధానఫలం చెందుతుంది?" అని ప్రశ్నించాడు.

సభికులంతా ఆలోచనలో పడ్డారు. "దానం చేసినవాడు మొదటివాడు కాబట్టి, అతడికి ఆ దానఫలం చెందుతుంది," అన్నారు కొందరు.

దాసరి వెంకటరమణ

అయితే మరికొందరు, ఆ డబ్బు రెండవవాడిది కాబట్టి, అతనికే ఆ దాన ఫలం చెందుతుంది, అన్నారు.

ఒకరు దానం చేశారు; మరొకరు డబ్బిచ్చారు. అందువల్ల, ఆ ఇద్దరికీ దాన ఫలం సమానంగా దక్కుతుంది, అన్నారు ఇంకొందరు.

సభికులు చెప్పిన, ఈ సమాధానాలేవీ సర్వోత్తముడికి రుచించలేదు.

ఆయన సభికులకేసి, ఒకసారి పరిశీల నగా చూసి, "మీ సమాధానాలేవీ, నాకు తృప్తికరంగా లేవు. మరొకసారి సావ ధానంగా ఆలోచించి చూడండి. ఆ దాన ఫలం ఎవరికి చెందుతుందో కాకుండా, ఎందుకు చెందుతుందో తార్కికంగా, హేతుబద్ధంగా బాగా ఆలోచించి చెప్పండి," అన్నాడు.

సభికులు ఎంత ఆలోచించినా, సర్వోత్త ముడికి తృప్తికలిగించే సమాధానం ఇవ్వ లేక పోయారు.

అప్పుడు సర్వోత్తముడు, మంత్రి సుమేధుడివంక చూసి, "మహామంత్రీ! ఆ సంఘటన మీరూ చూశారు గదా! మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి," అన్నాడు.

"ప్రభూ! నా దృష్టిలో దానం చెయ్య గలిగినంత అర్థికస్థోమతు కలిగి వుండడం కన్నా, దానం చేయాలన్న మనస్తత్వం కలిగివుండడం గొప్పదనం. ఆ కారణం వల్ల; ఆ దానఫలం తప్పక దానం చేసిన



మొదటివాడికే చెందుతుంది,'' అన్నాడు మంత్రి.

ఆ వెంటనే ఆస్థాన విదూషకుడైన ధరహాసుడు లేచి నిలబడి, ''ప్రభూ! మహామంత్రిగారి అభిప్రాయంతో నేను సగం మాత్రమే ఏకీభవిస్తున్నాను. ఎందుకంటే—ఒక కాసును దానం చేసిన పుణ్యం మొదటివాడికే లభిస్తుంది. అయితే, దానితోపాటు రెండవవాడికి ఒక కాసును ఎగవేసిన పాపం కూడా మొదటివాడికి చుట్టుకుంటుంది,'' అన్నాడు.

ఇది విని సర్వోత్తముడు నవ్వి, మంత్రి సుమేధుడి వంక చూశాడు.

సుమేధుడు చిన్నగా నవ్వి, ''మొదటివాడు బుద్ధిపూర్వకంగా కాసు ఎగవేయలేదు. తాను తిరిగి ఇస్తానన్నా, రెండవవాడు అందుకు ఒప్పుకోలేదు. అందువల్ల, మొదటివాడికి కాసును ఎగవేసిన పాపం ఏమాత్రం చుట్టుకోదు,'' అన్నాడు.

ధరహాసుడు మళ్ళీ లేచి నిలబడి, ''మరయితే, ఇందులో రెండవవాడికి లభించేదేమిటి? అతడిది ఒక కాసు ఖర్చయింది. దానిని మొదటివాడికి దానం చేసినట్లా? అలా అయితే, అతడికి ఆ కాసును మొదటివాడికి దానం చేసిన పుణ్యం అయినా లభిస్తుంది కదా!'' అన్నాడు.

''లభించదు! ఎందుకంటే, దానం ఇస్తున్నానన్న అభిప్రాయం రెండవవాడిలో, దానం తీసుకుంటున్నానన్న ఉద్దేశ్యం మొదటివాడిలో, లేదు. ఈ జరిగినదానిలో రెండవవాడు నిమిత్తమాత్రుడు మాత్రమే. కాసు తిరిగి తీసుకోవడానికి, అతడు నిరాకరించాడు కాబట్టి, ఆ ఒక్క కాసుకు అతడిదే బాధ్యత. దానం చెయ్యాలనే మంచి గుణం మనిషిలో లేనప్పుడు, అతడికి ధానఫలందక్కే ప్రసక్తిలేదు!'' అన్నాడు సుమేధుడు.

ఈ సమాధానానికి సర్వోత్తముడు తృప్తిగా తలాడించి, సుమేధుణ్ణి ఘనంగా సత్కరించాడు.





# వీర హనుమాన్

హనుమంతుడు సీతను తలుచుకుని ఒక నమస్కారం చేసి, ఇలా చెప్పాడు:

''నేను మహేంద్రపర్వతం మీది నుంచి ఎగరటం మీరందరూ చూశారు గదా. నేను ఆకాశంలో పోతూండగా ఒక అందమైన బంగారు శిఖరం నా దారికి అడ్డంగా పైకి లేచింది. నేను దాన్ని బద్దలు కొట్టుదామనుకున్నాను. కాని అది నన్ను ఎంతో వాత్సల్యంతో పలకరించి, నా తండ్రి వాయుదేవుడు తనను ఇంద్రుడి బారి నుంచి కాపాడాడనీ, తన పేరు మైనాకుడనీ, రామకార్యం మీద పోతున్న నాకు సహాయం చేస్తాననీ అన్నది. నేను తొందరలో ఉన్నానని చెప్పి, మైనాకుడి వద్ద సెలవు పుచ్చుకుని, ముందుకు వెళ్ళాను.

తరవాత, సర్పమాత అయిన సురస నన్ను మింగుతానని వచ్చింది. నేను అతి పవిత్రమైన పని మీద పోతున్నాననీ, పని తీరగానే వచ్చి తనకు ఆహారమవుతాననీ చెప్పినా ఆమె వినిపించుకోలేదు. నేను అంగుళం ప్రమాణం గల దేహంతో సురస నోట దూరి, మరుక్షణం బయటికి వచ్చేశాను. తరవాత సురస నన్ను దీవించి మరీ పంపింది. మరి కొంత దూరం వెళ్ళాక నా నీడను ఏదో పట్టుకున్నది. అది సముద్రంలో ఉన్న ఒక భయంకర రాక్షసి. నేను చేసేదిలేక అతి చిన్న రూపంతో దాని లోపలికి ప్రవేశించి, దాని గుండె చీల్చి, బయటికి వచ్చాను. దాని పేరు సింహిక అని విన్నాను.

17. మధువన విధ్వంసం



''తరవాత నేను లంక చేరి, రహస్యంగా లంకానగరం ప్రవేశించాను. అక్కడ లంక గొప్ప రాక్షసి రూపంలో నా ముందు నిలబడింది. నేను దాన్ని జయించి, సీత కోసం వెదకసాగాను రావణుడి ఇంట సీత లేదు. ఆమె నాకు ఒక గొప్ప ఉద్యానంలో కనిపించింది. ఆమె కృశించి, జుట్టంతా జడ కట్టుకుపోయి, శోకదేవత లాగా, భయంకరులైన రాక్షసస్త్రీల మధ్య కనిపించింది.''

ఈ విధంగా హనుమంతుడు తాను చూసినదీ, చేసినదీ పూసగుచ్చినట్టు వానరులకు చెప్పాడు. చిట్టచివరకు అతను ఇలా అన్నాడు.

''సీత మహా పతివ్రత. ఆమెను చూడగానే నాకు ఆమెపట్ల ఎంతో భక్తి కలిగింది. ఆమె వీరపత్ని. తన భర్తే రావణుణ్ణి చంపాలని ఆమె పట్టుదల. నేను ఒక మాట మీతో చెప్పాలని వచ్చాను. రావణుణ్ణి చంపటానికి మనం చాలుతాం. మనం అలాచేసి, సీతతో సహా రామలక్ష్మణుల వద్దకు పోవటం మంచిదని నా ఉద్దేశం. నిజానికి నేనే రావణుణ్ణి చంపగలను. ఇంద్రజిత్తు ప్రయోగించే అస్త్రాలు నన్నేమీ చెయ్యలేవు. మీరు సరేనంటే నేను ఇంద్రజిత్తును కూడా చంపేస్తాను. జాంబవంతుడూ, అంగదుడూ ఒంటరిగా రాక్షసులనందరినీ హతమార్చగలరు. ఎవరిచేతనూ చావకుండా వరం పొందిన మైందుడూ, ద్వివిదుడూ అనే మహాబలులైన రాక్షసులున్నారు. మీరు ఏమంటారు?''

అంగదుడు హనుమంతుడు చెప్పిన దానికి వెంటనే ఒప్పుకుని, ''ఔను! మనం సీతాదేవిని చూసినమీదట ఆమెను వెంట తీసుకుపోకుండా రాముడి దగ్గిరికి వెళ్ళటం చాలాతప్పు. 'సీతాదేవిని చూశాం గాని, ఆమెను తీసుకు రాలేదు,' అని రాముడితో ఎలా అనగలం? రాక్షసముఖ్యులనందరినీ హనుమంతుడు చంపనే చంపాడు. ఇక మనకు మిగిలినది

మాత్రం ఏమిటి? సీతాదేవిని తీసుకుపోదాం," అన్నాడు.

జాంబవంతుడు అంగదుడితో, "నువ్వు చెప్పినదంతా బాగానే ఉన్నది. కాని మనం రాముడి ఆజ్ఞ ప్రకారమే నడుచుకోవలసిన వాళ్ళంకదా. అలా చేద్దాం," అన్నాడు.

రాముడు వానరులతో సీతను చూసి రమ్మన్నాడుగాని, సీతను తీసుకురమ్మనలేదు. సీత వాళ్ళ వెంట రావటానికి సిద్ధంగా లేదని హనుమంతుడు వానరులకు చెప్పాడు కూడా.

అందరూ జాంబవంతుడి ఆలోచనకు సమ్మతించారు. ఇక వాళ్ళు శీఘ్రంగా రాముడి వద్దకు తిరిగి వెళ్ళి, సీత కనిపించిన వార్త చెప్పవలసి ఉన్నది. వానరులందరూ ఆకాశమార్గాన బయలుదేరి, భూలోకానికి నందనవనం అనదగిన మధువనం చేరారు. మధువనాన్ని కాపాడటానికి సుగ్రీవుడు తన మేనమామ అయిన దధిముఖుడు అనేవాణ్ణి నియమించాడు.

మధువనం చేరగానే వానరులు మధువు తాగటానికి అంగదుడి అనుమతి కోరారు. అంగదుడు సరేనన్నాడు. సీత కనిపించిన ఆనందంలో వానరులు మధువు తాగి, ఒకరినొకరు ఇంకా, ఇంకా తాగమని



ప్రోత్సహించుకుంటూ, నృత్యాలు చేశారు; కొందరు వెర్రి నవ్వులు నవ్వారు; మరి కొందరు ఒళ్ళు తెలియకుండా పడిపోయారు; కొందరు పరుగులు తీశారు; కొందరు ఎగిరారు; మరికొందరు కేకలు పెట్టారు; కొందరు చిన్న గుంపుగా భుజాలూ, భుజాలూ పట్టుకుని తిరిగారు; కొందరు రహస్యాలు చెప్పుకున్నారు; కొందరు పాడారు; ఒకళ్ళ మీద ఒకళ్ళు తూలుతూ, తప్పటడుగులు వేస్తూ పడ్డారు. ఒక్కడికి కూడా ఒంటి మీద సరిఅయిన స్పృహలేదు.

వానరులు వనంలో ఉన్న మధువంతా తాగెయ్యటమేగాక, చెట్లు కూడా పాడు



చెయ్యటం చూసి దధిముఖుడు ఆగ్రహించి, వానరులనందరినీ వనంలో నుంచి పొమ్మన్నాడు. ఎవరూ వినిపించుకోలేదు. అతను నయానా, భయానా వాళ్ళను హెచ్చరించయత్నించాడు. వాళ్ళు అతని మీదపడి గిల్లి, రక్కి, నానావిధాలుగా పీడించారు.

హనుమంతుడు వానరులతో, ''మీరు తాగండి. ఎవరు అడ్డం వస్తారో చూస్తాను,'' అంటూ ప్రోత్సాహం ఇచ్చాడు.

''హనుమంతుడు చెడ్డపని చెయ్యమన్నా చేస్తాను; మంచిపని చెయ్యమంటే ఎందుకు చెయ్యనూ?'' అన్నాడు అంగదుడు, మైకంలో.

అంగదుడి మాటలకు వానరులు హర్షించారు. వాళ్ళు తమకు అడ్డం వచ్చిన కావలివాళ్ళను కొట్టి, మధువు తాగుతూ చెట్ల మీది పళ్ళన్నీ తిన్నారు. వాళ్ళను అడ్డేవాళ్ళు లేకపోయారు. మొత్తం మీద మధువనం నాశనమయింది.

దధిముఖుడు ఈ దురాగతాన్ని చూస్తూ ఊరుకోలేక, తన బలగాన్ని తీసుకుని భయంకరంగా అరుస్తూ, వానరుల మీదికి యుద్ధానికి వచ్చాడు.

అంగదుడు, దధిముఖుడు తన తాత అన్నది కూడా పాటించకుండా, అతన్ని చావగొట్టాడు. ఇక చేసేదిలేక దధిముఖుడు తన వాళ్ళను వెంటబెట్టుకుని సుగ్రీవుడి వద్దకు వెళ్ళాడు.

దధిముఖుడు వచ్చి తన కాళ్ళ మీద పడగానే సుగ్రీవుడు, ఏం కొంప మునిగిందోనని భయపడి, ''అయ్యో, నా కాళ్ళ మీద పడ్డావేమిటి? లే, లే! నీ కేమీ భయం లేదు. ఏం జరిగిందో చెప్పు. మధువనంలో అల్లరి ఏమీ లేదు గద?'' అన్నాడు.

''రాజా, నీ తండ్రి ఋక్షరజుడి కాలంలోగాని, నీ కాలంలోగాని ఎవరూ చెయ్యసాహసించని అన్యాయం మధువనానికి ఈనాడు జరిగింది. అంగదుడు



వానరులు మధువనం చేరి అక్కడ మధువు తాగి, నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నారట. వాళ్ళు సీతను చూసి ఉండాలి; లేకపోతే వాళ్ళు మధువనాన్ని చెరిచేటంత సాహసం చెయ్యరు. వారిలో హనుమంతుడు తప్పక సీత జాడను తెలుసుకోగలిగి ఉంటాడు. ఈ పని అతని వల్ల తప్ప మరొకరి వల్ల కాదు. జాంబవంతుడూ, అంగదుడూ, హనుమంతుడూ ఏకమైతే అపజయం ఉండదు. లక్ష్మణా, నువ్వు కూడా ఆలోచించు, వాళ్ళు సీతను చూసి ఉండకపోతే ఇలా ప్రవర్తించరు. మధువనం నా తండ్రికి బ్రహ్మదేవుడు ఇచ్చినది!'' అన్నాడు.

ఈ మాట విని రామలక్ష్మణులు చాలా ఆనందించారు.

సుగ్రీవుడు దధిముఖుడితో, ''వానరులు మధువు తాగితే తాగనీ, పని చేసుకుని వచ్చారు గనుక నేను వారిని క్షమించగలను. వాళ్ళు వెళ్ళిన పని ఎలా చేసుకు వచ్చారో వినాలని నేనూ, రామలక్ష్మణులూ కుతూహలపడుతున్నాం,'' అన్నాడు.

దధిముఖుడు సుగ్రీవుడికీ, రామ, లక్ష్మణులకూ నమస్కారాలు పెట్టి, దిగులు తీరిపోయి, పచ్చినట్లుగానే తిరిగి మధువనానికి వెళ్ళి, ''అంగదుడా, మా

మొదలైన వానరులు అందులోకి ప్రవేశించి, అడ్డం వచ్చినవాళ్ళను చావగొట్టి, తాగినంత మధువుతాగి, పారబోసినంత పారపోశారు. నీ భయం కూడా వాళ్ళకు లేకుండా పోయింది,'' అన్నాడు దధిముఖుడు.

దధిముఖుడు సుగ్రీవుడి వద్దకు వచ్చినది, అతని వెంట రామలక్ష్మణులున్న చోటికి. దధిముఖుడు దేనికి వేదనపడుతున్నాడో అర్థం కాక లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి, ''ఇతను ఏమిటి చెబుతున్నాడు?'' అని అడిగాడు.

సుగ్రీవుడు లక్ష్మణుడితో, ''మనం సీతను వెతకటానికి దక్షిణంగా పంపిన

వాళ్ళు నిన్ను అడ్డగించారని కోపం పెట్టుకోకు. నువ్వా యువరాజువు! ఈ మధువనం మీద నీకు ఎంత అధికారమైనా ఉన్నది. మాదే పొరపాటు! క్షమించు. మీరంతా ఇక్కడికి వచ్చేశారని సుగ్రీవుడు ఎంతో సంతోషించాడు. మిమ్మల్నందరినీ వెంటనే పంపమని చెప్పాడు,'' అన్నాడు.

అంగదుడు వానరులతో, ''మనం ఇక్కడికి వచ్చిన వార్త రాముడికి తెలిసినట్టున్నది. మనం ఇక వెళ్ళకపోవటం మంచిదికాదు. అందరూ మధువు తాగి సేదదేరారు గనక, ఇక్కడ మన కింకేం పని?'' అన్నాడు.

వానరులు బయలుదేరటానికి సిద్ధంగానే ఉన్నారు. అంగదుడు ఆజ్ఞాపించకపోయినా, అతని మాట వారికి ఆజ్ఞే. అంగదుడు ఆకాశంలోకి లేవగానే వానరులంతా లేచారు. వాళ్ళు మేఘాలలాగా గర్జిస్తూ సుగ్రీవుడి వద్దకు బయలుదేరారు.

ఈ సమయంలో సుగ్రీవుడు రాముడితో, ''వానరులు సీతను చూసి వచ్చారనటానికి సందేహం ఏమీ లేదు. నేను పెట్టిన గడువు దాటిపోయిన ఇంత కాలానికి వాళ్ళు తిరిగి రానేరారు. అంగదుడు పని పూర్తిచెయ్యకుండా నన్ను చూడ



లేడు; మొదలు, మధువనంలో అలా ప్రవర్తించడు. సీత సమాచారం తెలిసిందే అనుకోవచ్చు. ఇక నీ దుఃఖం తీరినట్టే!'' అన్నాడు.

అదే సమయంలో వానరులు ఆకాశంలో ఎగురుతూ చేసే సింహనాదాలు వినవచ్చాయి. మరి కొద్దిక్షణాలు గడిచేసరికి వానరులందరూ సుగ్రీవుడి ముందు వాలారు.

హనుమంతుడు రాముడికి సాష్టాంగ నమస్కారం చేసి, ''చూశాను సీతను! ఆమె క్షేమంగా ఉన్నది,'' అన్నాడు. రాముడు అతనికేసి ఎంతో అప్యాయంగా చూశాడు.

అతను వానరులతో, ''వానరులారా, సీతాదేవి ఎక్కడ ఉన్నది? నాపట్ల ఆమె భావం ఎలా ఉన్నది? ఏమీ దాచకుండా, అంతా నాకు వివరంగా చెప్పండి,'' అన్నాడు.

మిగిలిన వానరులు హనుమంతుడితో, ''నువ్వు చెప్పు,'' అన్నారు.

హనుమంతుడు సీత ఉన్న దిక్కుకు తిరిగి దణ్ణం పెట్టి, ఆమె తనకు ఇచ్చిన మణిని రాముడికి ఇచ్చి, తాను సీతాదేవిని ఎలా చూసినదీ చెప్పాడు :

''నేను నూరు యోజనాలు గల సముద్రాన్ని దాటి సీతాదేవిని వెతకటానికి వెళ్ళాను. అక్కడ రావణుడు ఉండే లంకాపట్టణం ఉన్నది. ఆ లంకలో సీతాదేవి రాక్షసస్త్రీల నడుమ కృశించి జీవిస్తున్నది. ఆమె అనుభవిస్తున్న కష్టాలు ఆమెకు రావలసినవి కావు. నేను ఆమెను చూసే సమయానికి ఆమె ఆత్మహత్య చేసుకోవాలని నిశ్చయించుకుని ఉన్నది. నేను ఎలాగో ఆమెకు నమ్మకం కలిగించి, ఆమెతో మాట్లాడాను. మీరు చిత్రకూటపర్వతం మీద ఉండగా జరిగిన ఒక కాకి వృత్తాంతం నీకు గుర్తుగా చెప్పింది. ఆమె నీ చూడామణిని ఎంతో శ్రద్ధగా కాపాడిందట. తాను ఇంక ఒక్క నెల మాత్రమే జీవించి ఉండగలనని నీకూ, సుగ్రీవుడికీ చెప్పమన్నది. అందుచేత, సముద్రం దాటే ఉపాయం ఏదో ఆలోచించండి.''

హనుమంతుడిచ్చిన చూడామణిని రొమ్ము మీద పెట్టుకుని, రాముడు భోరున ఏడ్చాడు. అతనితో బాటు లక్ష్మణుడు కూడా ఏడ్చాడు. కళ్ళనీళ్ళు కార్చుతూనే, రాముడు సుగ్రీవుడితో, ''ఈ చూడామణిని చూడగానే నా గుండె ద్రవించి పోతున్నది. దీన్ని జనకుడు సీతకు ఇచ్చాడు. పెళ్ళిసమయంలో సీత దాన్ని తలలో పెట్టుకున్నది. దీన్ని చూస్తే నాకు దశరథుణ్ణీ, జనకుణ్ణీ చూసినట్టుగా ఉన్నది; సీతను చూసినట్టు కూడా ఉన్నది,'' అన్నాడు.



# తెలివిపరీక్ష

శృంగేరి రాజు విజయసేనుడికి, తన పరివారంలో అందరికన్నా తెలివైనవాడెవడో తెలుసుకోవాలన్న బుద్ధిపుట్టింది. ఆయన వాళ్ళను పిలిపించి, "మీరు నాతోపాటు అగ్నిగుండంలో దూకమంటే దూకుతారా? సముద్రంలో దుమకమంటే దుముకుతారా?" అని అడిగాడు.

ఇది విని అందరూ తెల్లబోయి చూస్తూండగా, శివయ్య అనేవాడు రాజుతో, "ప్రభూ! మీతోపాటు అగ్నిగుండంలో దూకడానికి సిద్ధంగా వున్నాను. కాని, మీతోపాటు సముద్రంలో దుమకడానికి మాత్రం పదిహేను రోజుల వ్యవధి కావాలి!" అన్నాడు.

ఈ జవాబుకు రాజు ఆశ్చర్యపోయి, "నిజం చెప్పు! నీకు ప్రాణం మీద ఆశలేదా? నాతోపాటు అగ్నిగుండంలో దూకడానికి సిద్ధంగా వున్నవాడివి, సముద్రంలో దుమికేందుకు పదిహేను రోజుల వ్యవధి ఎందు కడుగుతున్నావు?" అని ప్రశ్నించాడు.

"క్షమించండి, ప్రభూ! భార్యాబిడ్డలున్నవాణ్ణి. ప్రాణమంటే గంపెడాశ. అందుకే అలా అన్నాను. మీరు ఎలాగూ అగ్నిగుండంలో దూకి ప్రాణం పోగొట్టుకోరు. అందువల్ల, ఆ భయం నాకు లేదు. మీకు ఈత వచ్చు గనక, సముద్రంలో దుమికే అవకాశం వున్నది. మరి, నాకు ఈత రాదు. అది నేర్చుకునేందుకు పదిహేను రోజుల వ్యవధి అడిగాను," అన్నాడు శివయ్య.

రాజు పెద్దగా నవ్వి, శివయ్యను గొప్ప తెలివైనవాడివంటూ మెచ్చుకున్నాడు.

—కోలార్ కృష్ణ అయ్యర్





# ఐదు రొట్టెలు

ఒకనాడు సోమయ్యా, కామయ్యా అనే బాటసారు లిద్దరు దూరప్రయాణం చేస్తూ ఒక ఊళ్ళో పేదరాసి పెద్దమ్మ ఇంట కలుసుకున్నారు. మర్నాడు ఉదయం వారు బయలుదేరేటప్పుడు పేదరాసి పెద్దమ్మ వారికి దిబ్బరొట్టెలు మూటలు కట్టి ఇచ్చింది. సోమయ్య కొంచెం ఉదార బుద్ధి కలవాడు. కామయ్య కాస్త పిసినిగొట్టు. అందుచేత పేదరా పెద్దమ్మ సోమయ్య మూటలో మూడు రొట్టెలు పెట్టి, కామయ్య మూటలో రెండే ఉంచింది.

కొంతదూరం పాటు ఇద్దరి దారులూ ఒకటే కావటంవల్ల సోమయ్యా, కామయ్యా కలిసే బయలుదేరి, మిట్టమధ్యాన్నం వేళకి ఒక చెరువుగట్టున చెట్టు నీడను చేరుకున్నారు. వాళ్లు చెరువులో కాళ్లూ, చేతులూ, ముఖాలూ కడుక్కొని, చెట్టు నీడలో కూర్చుని రొట్టెలు తినటానికి మూటలు విప్పేసరికి సోమయ్య మూటలో మూడు రొట్టెలూ, కామయ్య మూటలో రెండు రొట్టెలూ కనిపించాయి.

"చూశారా, పేదరాసి పెద్దమ్మ పక్షపాతం? నా మూటలో రెండే రొట్టెలు పెట్టింది," అన్నాడు కామయ్య.

సోమయ్య నవ్వి, "రెండు రొట్టెలు మాత్రం తినగలమా? కానివ్వండి. అంతగా తినగలిగితే అయిదు రొట్టెలూ ఇద్దరమూ సమంగా పంచుకుని తిందాం. నాకేమీ అభ్యంతరంలేదు," అన్నాడు.

వాళ్ళు భోజనానికి కూచోబోయే సమయానికి ఆ చెట్టునీడకు రామయ్య అనే మూడో బాటసారి వచ్చాడు.

"అయ్యలారా! ఆకలి దహించుకుపోతోంది. మీ ఆహారంలో కొంత నాకు యిస్తే మీ రుణం వుంచుకోను!" అన్నాడు రామయ్య.

"మీరు కూడా మాతోపాటు భోజనం చేద్దురుగాని. మా రొట్టెలు ముగ్గురికీ సరి పోకపోవు," అన్నాడు సోమయ్య.

అడగటమే తడవుగా రామయ్య కూడా వారితోబాటు కూచున్నాడు. ఉన్న రొట్టె లను ముగ్గురూ పంచుకుని తృప్తిగా తిని చెరువునీరు తాగారు. రామయ్య మిగిలిన ఇద్దరికీ తన కృతజ్ఞత చెప్పుకుని సోమయ్య చేతిలో డబ్బులు పెట్టబోయాడు. సోమయ్య ఎంత వద్దన్నా వినకుండా అయిదణాలు అతడి చేతిలో పెట్టి తన దారిన వెళ్ళిపోయాడు.




సోమయ్య ఆ అయిదణాలలో రెండు తీసి కామయ్యకిస్తూ, "మీవంతు మీరు పుచ్చుకోండి. నావి మూడు రొట్టెలు. మీవి రెండు రొట్టెలు. ఇందులో రెండణాలు మీకు చెందటం న్యాయం," అన్నాడు.

"ఇది చాలా అన్యాయం. రామయ్యకు మనం రొట్టెలు అమ్మలేదు. ఆయనే కృతజ్ఞతాపూర్వకంగా మన ఇద్దరికీ అని అయిదణాలిచ్చాడు. అందులో సగం మీదీ, సగం నాదీ. నాకు మరో అర్ధణా వస్తుంది. దయచేసి ఇవ్వండి," అన్నాడు కామయ్య.

సోమయ్యకు అర్ధణా గురించి కాపీనం లేకపోయినప్పటికీ, కామయ్య పిసినిగొట్టు తనం చూసి ఒళ్ళు మండుకొచ్చింది.

"పదండి. మనం దగ్గిర గ్రామానికి వెళ్ళి న్యాయాధికారినడిగి న్యాయం తేల్చుకుందాం. మీరు చెప్పేది నాకేమీ న్యాయంగా కనబడటం లేదు," అన్నాడు సోమయ్య.

ఇద్దరూ కొంతదూరం నడిచి ఒక గ్రామం చేరుకుని ఆ ఊరి న్యాయాధికారి వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పారు.

న్యాయాధికారి ఇద్దరి మాటలూ విని, కామయ్య కేసి తిరిగి, "న్యాయం చెప్పా లంటే, రామయ్య ఇచ్చిన అయిదణాలలో సోమయ్య వంతు నాలుగణాలు. నీవంతు ఒక అణా. కనుక నీవు సోమయ్యకు ఒక అణా ఇచ్చి వెయ్యి!" అన్నాడు.

ఈ తీర్పు విని కామయ్య నిర్ఘాంత పోయాడు. న్యాయాధికారి మరొక అర్ధణా ఇప్పిస్తాడనుకుంటే తననే ఒక అణా సోమయ్య కిమ్మంటున్నాడు!

"అయ్యా, ఇదేం న్యాయం? మా మా రొట్టెల సంఖ్యను బట్టి చూసినా నాకు రెండణాలు రావాలికదా? నన్ను అణా మాత్రమే తీసుకోమంటారే?" అన్నాడు లోభి అయిన కామయ్య.

"అవును నేను చెప్పినదే న్యాయం. అది ఎలా న్యాయమో చెబుతాను. ఐదు రొట్టెలను ముగ్గురు ఎలా పంచుకున్నారు?" అని అడిగాడు న్యాయాధికారి.

"చిత్తం! ఒక్కొక్క రొట్టెనూ మూడేసి భాగాలు చేశాం. పదిహేను భాగాలనూ ముగ్గురమూ మూడయిదులుగా తిన్నాం," అన్నాడు కామయ్య.

"నీ రొట్టెలను భాగించగా ఎన్ని ముక్కలయాయి?" అన్నాడు న్యాయాధికారి.

"చిత్తం! ఆరండి," అన్నాడు కామయ్య.

"అందులో అయిదు నీవే తిన్నావు. ఒకటి మాత్రం రామయ్య కిచ్చావు. సోమయ్య తెచ్చిన మూడు రొట్టెలూ తొమ్మిది రొట్టెలయాయి. అందులో అయిదు మాత్రం తాను తిని నాలుగింటిని రామయ్య కిచ్చాడు.

"రామయ్య తాను తిన్న అయిదు ముక్కలకూ అయిదణాలు ఇచ్చాడు. అతడు తిన్న అయిదు ముక్కలలో ఒక ముక్క మాత్రం నీది, నాలుగు ముక్కలు సోమయ్యవి. కాబట్టి రామయ్య ఇచ్చిన అయిదణాలలో నాలుగు సోమయ్యకు చెందుతాయి, ఒకటి మాత్రమే నీకు చెందుతుంది," అని న్యాయాధికారి వివరించాడు.

సోమయ్య తనకిచ్చిన రెండణాలలో ఒకటి తిరిగి ఇచ్చేసి కామయ్య తన పేరాశను నిందించుకుంటూ, తన దారిన తాను వెళ్ళాడు. న్యాయాధికారి కుశాగ్రబుద్ధిని మెచ్చుకుంటూ సోమయ్య కూడా తన ప్రయాణం సాగించాడు.



# పిచ్చి కుదిరింది!

వీరవరంలోని గోపాలం, గోవిందం ఒకనాటి సాయంత్రం పక్క ఊరి సంతకు బయల్దేరారు. ఇంతలో ఎవరో పాలబిందెతో వాళ్ళకు ఎదురువచ్చారు.

"పాలబిందె చాలా మంచి శకునం! మనకు మంచి జరిగి తీరుతుంది," అన్నాడు గోపాలం.

అతడికి శకునాలపై నమ్మకం ఎక్కువ.

"అంతా నీ వెర్రి! జరిగేదెలాగూ జరుగుతుంది. ఇలాంటి పిచ్చినమ్మకాలు వదిలెయ్యి," అన్నాడు గోవిందం.

వాళ్ళు పక్క ఊరు చేరేసరికి, దాని పొలిమేరల్లో ఒక పెద్ద సభ ప్రారంభం కాబోతున్నది. హిమాలయాల నుంచి వచ్చిన గొప్ప సాధువొకాయన అక్కడ ధర్మోపన్యాసం ఇవ్వబోతున్నాడు. మిత్రులిద్దరూ అది వినేందుకు అక్కడే ఆగిపోయారు.

కొంతసేపు తర్వాత సాధువు వచ్చాడు. మూఢనమ్మకాలను నిరసిస్తూ అనర్గళంగా సాగిన ఆయన ఉపన్యాసం అక్కడ చేరినవాళ్ళనందరినీ ముగ్ధుల్ని చేసింది. శకునాలనూ, తుమ్ములనూ నమ్మడం మూర్ఖత్వమంటూ, ఆయన బోధ చేసిన తీరు అద్భుతంగా వుంది.

"ఎంతో మేలు చేసే విషయం! సాధువు బోధలు వినగలగడం మన అదృష్టం! ఇక మనలో మూఢనమ్మకాలకు చోటే లేదు," అన్నాడు గోవిందం.

"అవును, చూశావా! నేను ముందే చెప్పలేదూ? పాలబిందె శకునం వల్ల మంచి జరుగుతుందని!" అన్నాడు గోపాలం.

—వక్కలంక 'కిషోర్'






# వైద్యుడు-వైద్యపండితుడు

శ్రీముఖుడనే యువకుడికి గొప్ప వైద్యుడు కావాలని కోరిక. దండకారణ్యంలో వున్న దివ్యాత్ముడనే మహామునికి, వైద్యశాస్త్రంలో తెలియని రహస్యాలు లేవని విని, వాడు కష్టపడి, ఆయనవద్దకు వెళ్ళాడు.

దివ్యాత్ముడు, శ్రీముఖుడి శ్రద్ధాసక్తులకు ఎంతో సంతోషించి, నాలుగు సంవత్సరాలపాటు వాడికి శరీరశాస్త్రం గురించీ, వనమూలికల గురించీ ఎన్నో రహస్యాలు విపులీకరించి చెప్పి, చికిత్సా విధానాలు బోధించాడు.

ఒక రోజున దివ్యాత్ముడు శ్రీముఖుడికి, "నాయనా! చదువు పట్ల నీ శ్రద్ధాసక్తులకు ఎంతో సంతోషించాను. సాధారణంగా పది సంవత్సరాలుపట్టే విషయాన్ని నువ్వు, నాలుగు సంవత్సరాలలోనే నేర్చుకున్నావు. ఇక నీ విద్యాభ్యాసం పూర్తయింది. అయితే వైద్యం ప్రారంభించేముందు, నువ్వు సమర్థుడనిపించుకున్న వైద్యుడికి కొంతకాలం శుశ్రూష చేయడం అవసరం," అని చెప్పాడు.

శ్రీముఖుడు గురువుకు పాదాభివందనం చేసి, చిత్రపురమనే నగరంచేరుకున్నాడు. అక్కడ పేరు పొందిన వైద్యులు నలుగురున్నారు. ఆ నలుగురిలోనూ సదానందుడు సర్వసమర్థుడుగా పేరు పొందాడు. శ్రీముఖుడు, సదానందుణ్ణి కలుసుకుని మాట్లాడాలంటే, నిరంతరం తనవద్దకు వచ్చే రోగులతో క్షణం తీరికలేకుండా వున్నాడు. అందువల్ల, శ్రీముఖుడు మిగతా ముగ్గురు వైద్యులనూ కలుసుకున్నాడు. వారిలో ఏ ఒక్కరికీ కూడా వైద్యవిద్యలో పాండిత్యం లేదని శ్రీముఖుడికి అర్థమయింది.

శ్రీముఖుడు ఆ ముగ్గురు వైద్యులనూ విడివిడిగా, "అయ్యా! వైద్యం చేసేవాడికి

జొన్నలగడ్డ రామలక్ష్మి

శరీరశాస్త్రం గురించీ, రోగలక్షణాల గురించీ, మూలికల గుణాల గురించీ క్షుణ్ణంగా తెలియాలి. నా గురువు సమర్థుడైన వైద్యుడికి కొంతకాలం శుశ్రూష చేసి అప్పుడు నన్ను వైద్యం ప్రారంభించమని చెప్పాడు. నువ్వు పాండిత్యంలో నన్ను మించినవాడివి కాదు. కాబట్టి, నన్ను సదానందుడికి పరిచయం చేయ గోరుతున్నాను,'' అని చెప్పాడు.



దీనికి బదులుగా ప్రతి వైద్యుడూ కూడా, ''ఆ సదానందుడికి అదృష్టం బాగుండి పేరు వచ్చింది తప్పితే, వాడికి నామాత్రం పాండిత్యం కూడా లేదు. వాడిచ్చే మందులన్నీ వాళ్ళనూ, వీళ్ళనూ అడిగి తెలుసుకున్నవే! మొదట్లో వాడి మోసం తెలియక, నేను కూడా వాడికి సాయపడ్డాను. నా సాయంతో వాడిప్పుడు నన్నే మించిన పేరు తెచ్చుకున్నాడు. ఇప్పుడు కూడా వాడు సంపాదన లేని కొందరు పేద వైద్యుల సాయం తీసుకుని రోగులకు మందులిచ్చి, పేరు తెచ్చుకుంటున్నాడు,'' అని చెప్పాడు.

శ్రీముఖుడికిది నమ్మబుద్ధి కాలేదు. కొద్ది రోజులపాటు వాడు సదానందుడి ఇంటిపై నిఘావేసి, మిగతా వైద్యుల మాటల్లో నిజముండి వుండవచ్చని అనుమానించాడు. ఆ విషయం తేల్చుకునేందుకు వాడు, తనూ ఒక రోగిలా సదానందుడి వద్దకు వెళ్ళి, వైద్యశాస్త్రంలో మహా పండితులైనవారికి తప్ప తెలియని రోగలక్షణాలు చెప్పాడు. సదానందుడు, శ్రీముఖుణ్ణి నాలుగు రోజుల తర్వాత కనిపించమన్నాడు.

నాలుగు రోజులు గడిచాక తనవద్దకు వచ్చిన శ్రీముఖుడితో, సదానందుడు, ''నీ జబ్బును తగ్గించడానికి మూడు మార్గాలున్నాయి. ఏ మందులూ వాడకుండా నేను చెప్పిన కాయగూరలు మాత్రమే పథ్యంగా తింటూ సంవత్సరం పాటు గడపాలి. ఇది మొదటి మార్గం. రెండవదేమిటంటే—నేనిచ్చిన మందులు



వేసుకుంటూ నాలుగు మాసాలపాటు పథ్యం చేయాలి. మూడవ మార్గంలో, ఈ జబ్బు వారమంటే వారం రోజుల్లో నయం చేయవచ్చు. మొదటి మార్గంలో వెయ్యి వరహాలు, రెండవ మార్గంలో మూడువేల వరహాలు, మూడవ మార్గంలో అయిదువేల వరహాలు, నాకిచ్చుకోవాలి. ఇందులో నీకేది అంగీకారమో చెబితే, నీ మీద కొన్ని పరీక్షలు జరిపి వైద్య నిర్ణయం చేయవలసి వుంటుంది.'' అన్నాడు.

అప్పుడు శ్రీముఖుడికి కలిగిన ఆశ్చర్యం అంతా, ఇంతా కాదు. వాడు సదానందుడి వంక మెచ్చుకోలుగా చూసి, ''నువ్వు సామాన్యుడివి కాదు. ఈ జబ్బుకు ఇంత కాలం రెండేరెండు నయం చేసే మార్గాలుండేవి. నా గురువు దివ్యాత్ముడు రెండు మాసాల క్రితమే మూడవ మార్గాన్ని పరిశోధించి తెలుసుకున్నాడు. అది నీకు ఎప్పుడో తెలియడం విశేషమే!'' అన్నాడు.

సదానందుడు వెంటనే, ''నువ్వు దివ్యాత్ముడి శిష్యుడు శ్రీముఖుడివేనా? ఈ జబ్బుకు వైద్యం గురించి తెలుసుకుని రమ్మని, నేను నా మనిషిని ఆయన వద్దకు పంపాను. ఆయన నీ గురించి కూడా తన సమాధానంలో రాశాడు. అయితే నీకింతలో, ఈ జబ్బెలా వచ్చింది? పైగా ఈ జబ్బుకు వైద్యం తెలిసి కూడా నువ్వు నావద్ద కెందుకు వచ్చావు?'' అని అడిగాడు.

శ్రీముఖుడాయనకు తన అనుభవం, ఉద్దేశ్యం చెప్పి, ''నువ్వు వైద్యశాస్త్రం ఎవరివద్ద అభ్యసించావు? నగరంలో నీకే ఇంత పేరు రావడానికి కారణమేమిటి? నువ్వు వైద్యానికి అందరికంటే ఎక్కువ డబ్బు తీసుకునేందుకు కారణమేమిటి?'' అని అడిగాడు.

అప్పుడు సదానందుడు, శ్రీముఖుడికి తన కథ ఇలా చెప్పాడు.

సదానందుడు స్వతహాగా వైద్యుడు కాదు. కొన్నేళ్ళ క్రితం పొట్టపోసుకోవడం

కోసం, ఆయన ఒక వైద్యుడివద్ద మందులు నూరే పనికి చేరాడు. వైద్యుడేం చేస్తున్నదీ శ్రద్ధగా గమనించి రోగాల గురించీ, మందుల గురించీ కుతూహలంగా అడిగి తెలుసుకునే వాడు. ఉన్నట్లుండి వైద్యుడు మరణించాడు. వైద్యుడి దూరపు బంధువులు వచ్చి, ఆయన ఆస్తి పట్టుకుపోయారు. వైద్యుడి వద్ద చికిత్స పొందుతున్న వారందరికీ, ఆ చికిత్సావిధానం క్షుణ్ణంగా తెలిసిన సదానందుడు వైద్యం కొనసాగించాడు. అతడి హస్తవాసి మంచిదనీ, చనిపోయిన వైద్యుడి కంటే బాగా వైద్యం చేస్తాడనీ పేరు వచ్చింది. కానీ శాస్త్రం తెలియకుండా వైద్యం చేయడం సదానందుడి కిష్టం లేదు. అలాగని ఎక్కడికో పోయి వైద్యశాస్త్రం నేర్చుకోనూ లేదు. ఆయన తన భార్యాబిడ్డల్ని పోషించాలంటే ఏదో మార్గం వెతుక్కోవాలి. అందుకని, ఆయన ఆ ఊరు వదిలిపెట్టి చిత్రపురం చేరుకుని, తెలిసినవాళ్ళను ఏదైనా పని ఇప్పించమని అడిగాడు.

అలా సదానందుడికి తెలిసినవాళ్ళలో ఒక వైద్యుడు, ''బాబూ! నాకు వైద్యశాస్త్రంలో చాలా గొప్ప రహస్యాలు తెలుసు. కానీ వైద్యుడుగా పేరు తెచ్చుకోలేకపోయాను. అందువల్ల నీకు మందులు



నూరే పని కూడా ఇవ్వలేని దౌర్భాగ్యపు స్థితిలో వున్నాను. నీ హస్తవాసి మంచిది. నేను నీకొక సలహా ఇస్తాను. ఇప్పటికే మంచి వైద్యుడిగా నీకు, నీ ఊళ్ళో పేరుంది. ఇక్కడ చిత్రపురానికి కొక మహావైద్యుడు వచ్చాడని ప్రచారం చేస్తాను. నీవద్దకు వచ్చే రోగుల జబ్బుకు వైద్యం చెప్పి, నేను నీకు సాయపడతాను. నీకు వచ్చే ఆదాయంలో నాకు కొంత వాటా ఇవ్వు!'' అన్నాడు.

సదానందుడు దీనికి అంగీకరించి, ''నా అజ్ఞానం కారణంగా ఏ రోగికైనా అన్యాయం జరిగితే, నేను వైద్యం మానేస్తాను,'' అన్నాడు.



సలహాలివ్వు. వైద్యుడిగా నాకు పరిపూర్ణత లభిస్తుంది,'' అన్నాడు.

ఇందుకు శ్రీముఖుడు అంగీకరించాడు. ఆ రోజు నుంచీ వాడు సదానందుణ్ణి శ్రద్ధగా గమనిస్తూ వచ్చాడు. రోగులతో సదానందుడు మాట్లాడే పద్ధతి వాడికెంతో నచ్చింది.

ఒక రోజున సదానందుడి వద్దకు ఒక వ్యక్తి వచ్చి, ''అయ్యా! తమరిచ్చిన మందు చాలా బాగా పని చేస్తున్నది. రోజూ భోజనం చేసిన వెంటనే పూటకొక సారి చొప్పున వేసుకుంటున్నాను,'' అన్నాడు.

ఆనాటి నుంచీ సదానందుడు తనకు తెలియని విశేషాలను, ఇతర వైద్యుల నుంచి డబ్బిచ్చి తెలుసుకుంటూ పెద్ద పేరు తెచ్చుకున్నాడు.

తన కథ అంతా చెప్పి సదానందుడు, శ్రీముఖుడితో, ''గురువు దగ్గిరకంటే, వైద్యుల దగ్గిర నుంచి నేర్చుకోవడానికి ఖర్చెక్కువ. అందుకే నా వైద్యం ఖరీదైనది. ఇప్పుడు నా శాస్త్ర పరిజ్ఞానం మీద, నాకు గురి కూడా కుదిరింది,'' అన్నాడు.

శ్రీముఖుడు, సదానందుడివద్ద శుశ్రూష చేస్తానన్నాడు. దీనికి సదానందుడు నొచ్చుకుని, ''నువ్వు దివ్యాత్ముడి శిష్యుడివి. ఒక సంవత్సరంపాటు నాతోనే వుంటూ

ఇది విని శ్రీముఖుడు కంగారుగా, ''ఈ మందు పని చేయాలంటే భోజనానికి అరగంటముందు కానీ, అరగంట వెనక గానీ వేసుకోవాలి. నువ్వు చాలా పొరబాటు పని చేశావు,'' అని ఇంకా ఏదో అన బోతూండగా, సదానందుడు కలగజేసుకుని రోగితో, ''ఇతడు వైద్యానికి కొత్తలే! నువ్వు నిశ్చింతగా మరొక రెండు రోజులు మందు వేసుకుని మళ్లీ నాకు కనిపించు,'' అన్నాడు.

రోగి వెళ్ళిపోయాక శ్రీముఖుడు ముఖం చిన్నబుచ్చుకుని, సదానందుడేదో చెబుతున్నా వినిపించుకోకుండా, పక్క గది లోకి వెళ్ళిపోయాడు.

రెండు రోజుల తర్వాత రోగి వచ్చినప్పుడు సదానందుడు, అతడితో, "నీకిప్పుడు మందు మారుస్తున్నాను. ఈ మందు రోజూ భోజనానికి అరగంట ముందుగానీ వెనకగానీ పుచ్చుకోవాలి," అన్నాడు.

రోగి వెళ్ళిపోయాక శ్రీముఖుడు, "నువ్వు మందు మార్చలేదు. నీ తప్పును దిద్దుకున్నావు. రెండురోజుల క్రితం నీ తప్పు గురించి చెబితే, ఒప్పుకునేందుకు అహంకారం అడ్డొచ్చింది, నీకు. వైద్యుడికి అహంకారం పనికిరాదు. రోగి బాగోగుల కంటే, అహంకారమే ముఖ్యమనుకోవడం తప్పుగదా!" అన్నాడు.

అందుకు సదానందుడు ఏమాత్రం చలించకుండా, "నా రోగి నన్ను నమ్మాడు. నేను మందిచ్చి ముఖ్య విషయం చెప్పడం మరిచాను. అందువల్ల రోగికి అన్యాయం జరిగితే, నేను నా తప్పు ఒప్పుకుని రోగికి అసలు విషయం చెప్పాలి. కానీ ఏ కారణం వల్లనో, ఆ మందు రోగికి అలా కూడా పని చేసింది. అలాటప్పుడు నావల్ల పొరబాటు జరిగిందని తెలిస్తే, రోగికి నామీద నమ్మకం పోయి రోగం మళ్ళీ తిరగబెట్టవచ్చు. అందువల్ల మరొక రెండు రోజులు మందు నలాగే కొనసాగనిచ్చి, అప్పుడు మార్చాను. వైద్య వృత్తిలో, వైద్యుడికి రోగి నమ్మకం వైద్యం కంటే కూడా ముఖ్యమైనది. ఎలాంటి పరిస్థితుల్లోనూ నేను, రోగికి నాపై నమ్మకం పోనివ్వను. మందు పనిచేయనప్పుడు తప్పొప్పుకోవాలి కానీ, పనిచేసినప్పుడు తప్పొప్పుకోకూడదు. అర్థమయిందా?" అన్నాడు.

శ్రీముఖుడు, సదానందుడికి రెండు చేతులూ జోడించి నమస్కరించి, "వైద్యుడికీ, వైద్యపండితుడికీ తేడా ఇప్పటికి నాకు తెలిసింది. వైద్యుడుగా పేరు తెచ్చుకునేందుకు కాక, రోగికి నయం చేయాలని వైద్యం చేసే నీవే నాకు ఆదర్శం!" అని ఆయనవద్ద సెలవు తీసుకుని, మరొక నగరానికి వెళ్ళి వైద్యుడుగా గొప్ప కీర్తి సంపాదించాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



S. B. Takalkar



Manjula

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అక్టోబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: అనుకరించే వయసు! రెండవ ఫోటో: కరుణచూపే మనసు!

పంపినవారు: ఆర్. విశ్వేశ్వరరావు, ఏలూరు—534 001, తూ. గో. జిల్లా (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 48-00

చందా పంపవలసిన చిరునామా:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.




1975
వనితల స్థితిగతులు
మెరుగుపరచడానికై....

* అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఉదయించిన ఏకైక స్త్రీజన పత్రిక ఏది?

**వనిత**

* దశాబ్దంన్నరగా స్త్రీలకు ఉపయుక్తమైన అనేక అంశాలను ప్రస్తావిస్తున్న ఏకైక మాస పత్రిక ఏది?

**వనిత**

* మగి నెలతల ప్రియనెచ్చెలి ఏది?
నిస్సందేహంగా

**వనిత**

1991
వనితలను అభ్యుదయ పథంలో
నడిపించడంలో పదహారవ
సంవత్సరం....






కారణం
● విజ్ఞానానిధి ● వికాసానిధి ● వినోదానిధి

**వనిత**

చందా వివరాలకు:
విజయా బుక్ హౌస్,
చందమామ బిల్డింగ్స్,
వడపళని, మద్రాసు - 600 026

# Cuddles always say "I love you."

Show your little ones how much you love them! And is there a better way of doing that than giving them a huggable, cuddlable playmate?

Cuddles. From the people who have given children the delightful entertainer of a magazine, Chandamama. Cuddles. A whole new range of stuffed toys. And, your old favourites. And, cute surprises being introduced regularly. Each one a sweet, adorable companion to your child. Absolutely safe. Designed to withstand childhandling.

Well, the fun and excitement of the festive season is just round the corner. Make it memorable for your child with a special gesture. With a Cuddle.

- CUDDLES — Stuffed toys from Chandamama
- SAMMO — Mechanical and electronic toys from Chandamama

**CUDDLES**

Manufactured in technical collaboration with Sammo Corporation, South Korea

**CHANDAMAMA TOYTRONIX**

Chandamama Toytronix Private Limited, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026

*from*

**THE HOUSE OF**

**CHANDAMAMA**

**CUDDLES AND SAMMO TOYS WILL BE AVAILABLE AT ALL LEADING TOY OUTLETS EXCEPT IN THE STATES OF ASSAM, HIMACHAL PRADESH, MADHYA PRADESH AND NORTH EASTERN STATES**